

శ్రీమతి రామానుజాయ నమః

# తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై రహస్యమ్

## ( ఆంధ్ర వివరణంతో )

ఆంధ్ర వివరణం

పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు

సమర్పణము

భాగవత దాసులు వేదాల సోదరులు

2017

# తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై రహస్యమ్

ఆంధ్ర వివరణం
పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు

ప్రథమ ముద్రణం : ఏప్రిల్, 2017

ప్రతులు : 300



ఈ గ్రంథం భగవద్రామానుజ సహస్రాబ్ది సందర్భంలో
శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యస్వామివారి,
ఉ॥వే॥ శ్రీమాన్ తట్టావేణుగోపాలాచార్యస్వామివారి,
శ్రీమతి కాండూరి విజయలక్ష్మిగారి పవిత్ర స్మతిగా
ముద్రింపబడి భాగవతలోకానికి సమర్పింపబడుతున్నది.

**ప్రాప్యాయ శ్రీయతీశానముఖోల్లాసాయ భక్తితః।**
**ప్రకాశ్యతేయం సద్గ్రంథః శ్రీమద్వేదాలసోదరైః ॥**

ప్రతులకు : శ్రీమాన్ వేదాల శ్రీరామాచార్యులు
ప్లాట్ నెం.12, సెక్టార్ నెం.11
ఎం.వి.పి. కాలనీ, విశాఖపట్టణం
ఫోన్ : 98859 49212

డి.టి.పి. : జయలక్ష్మి, చంద్రశేఖర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎస్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.



పరమహంసపరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్‌స్వామివారు**
శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాన్తపీఠం, కాకినాడ





[illegible]

అస్మద్గురుభ్యో నమః
శ్రీమతే రామానుజాయ నమః

# కృతజ్ఞతా నివేదనమ్

శ్రీమత్ భగవద్రామానుజులవారి సహస్రాబ్ది మహోత్సవముల సందర్భంగా శ్రీరామానుజమతానుయాయులు చాలామంది తమవంతు కైంకర్యముగా అనేక కార్యక్రమములు నిర్వహిస్తున్నారు. పరమహంస పరివ్రాజకులు. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు తలపెట్టిన సమతామూర్తి, భగవద్రామానుజుల మహావిగ్రహ ప్రతిష్ఠాపనము **'న భూతో న భవిష్యతి'** అనునట్టిది. పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామివారు సంకల్పించిన ప్రతిమాసం ఆరుద్ర తిరునక్షత్రాన భగవద్రామనుజులవారికి సహస్ర కలశాభిషేకమహోత్సవం, రామానుజులవారి సందేశాన్ని ఆంధ్రదేశ నలుచెరుగుల వ్యాపింపచేసి సర్వసాధారణ జనులందరును పునీతగాత్రులను చేసి ఆత్మోజ్జీవనానికి దోహదపడుతుంది. ఇలాంటి అనేక సామూహిక కార్యక్రమాలు ఒక పక్కనైతే, మరొకప్రక్క రామానుజులవారి సందేశాన్ని రక్షించి వ్యక్తపరచి గ్రంథజాతాన్ని పునర్ముద్రించి అందరకు అందుబాటులో వుండేలాగచేసే ప్రయత్నం జరుగుతోంది. అలాంటి సహస్రాబ్ది కార్యక్రమాలలో భాగంగా మా వేదాల సోదరులము, పరమపదవాసులు, శ్రీమాన్ వేదాల కోనమాచార్యులు, వీరరాఘవమ్మ గారి సంతానమైన మేము, **"తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై రహస్యమ్"** అనే ఈ కోశమును ప్రచురింపచేయటం జరుగుచున్నది. అదియు మా పితామహ, మాతామహుల సంస్మరణ రూపంగా.

మా పితామహులు పరమపదవాసులు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గారు మత్స్యపురిగ్రామనివాసులు. మాకు ఉత్తరకాచార్యులు. వారి తిరుముఖమండలమునుండి ఎల్లవేళలా నారాయణ నామోచ్చారణమే మేము వినేవారము. నారాయణ నామము వారికి పరమంత్రము. ఇక, మా మాతామహులు పరమపదవాసులు, ఉ॥వే॥ శ్రీమాన్ తట్టావేణుగోపాలాచార్య స్వామివారు (బందరు వాస్తవ్యులు) సదా "ఎంబెరుమానార్" అని ఆదరము మీర ఉచ్చరిస్తూ, వారిపట్ల ఆచార్యప్రతిపత్తిని సమృద్ధిగా కలవారు. వీరు మాకు మొదటి ఉపకారకాచార్యులు. వీరు ఇరువురు ఈ దాసులకు



చిరస్మరణీయులు. ఈ స్మృతి సంతతి అవిచ్ఛిన్నంగా సాగిపోతూ వుండాలని ఈదాసుల అభీష్టము. ఈ సంతతికి, వారి సంతతికి, వారి వారి సంతతికి- ఈవిధంగా భగవత్ప్రతిపత్తి, ఆచార్యప్రతిపత్తి - అనే ఈ రెండు మా కుటుంబమున అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉండాలనే ఆశతో వారి సంస్మరణకు ప్రతీకగా ఈ కోశాన్ని లోకమునకు అందించే ప్రయత్నం జరుగుచున్నది. ఈ మధ్యనే హఠాత్తుగా ఆచార్య తిరువడిని చేరిన శ్రీమతి కాండూరి విజయలక్ష్మి (శ్రీమాన్ శ్రీరామాచార్యులవారి కుమార్తె) పవిత్ర స్మృతిగా కూడా ఈ గ్రంథముద్రణ చేయబడుతున్నది. మా ఈ ప్రయత్నమును పండిత రత్న, వేదాంతవాచస్పతి, సత్సంప్రదాయ విద్వన్మణి డా॥ ఉ॥ వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి అళహ శింగరాచార్యులవారిద్వారా సుసంపన్నం అయినది. శ్రీమాన్ శింగరాచార్య స్వామివారి గురించి ఎంత చెప్పిన ఇంకా చెప్పవలసినది. మిగిలిపోతూనే ఉంటుంది. శ్రీవైష్ణవసంప్రదాయ రహస్యాలను, శ్రీవైష్ణవ సంప్రదాయ కోశాలను తమిళభాషలో ఉన్నవాటిని తెలుగులో అనువదించి తమిళం తెలియనటువంటి ఆంధ్ర శ్రీవైష్ణవులందరకు మహోపకారము ఒనరించిన, ఒనరించుచున్న ధన్యజీవులు. శ్రీమాన్ సింగరాచార్యులవారు ఎందరో మహామనీషుల స్మరణ పూర్వకంగా ఎన్నో కోశాలను పరిష్కరించి కృపచేశారు. ఇది జగద్విదితమే. వీరు సాయించినది అనువాద సాహిత్యమే అయినప్పటికి, ఆయా అనువాద గ్రంధాల పరిచయప్రస్తావనతో వీరి పాండిత్యగరిమ, రచనావైశిష్ట్యము, విషయ ప్రతిపాదన, సిద్ధాంత నిరూపణ సామర్థ్యము సువ్యక్తమగును. వీరు కృపతో మా సంకల్పాన్ని వాస్తవం చేశారు. వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు విన్నవించుకోవటం తప్ప ఇంక ఏమి చేయగలము? ఏమి చేసినా వారి సౌహార్దానికి సరిపోదనుట యథార్థము. వారికి మా వినయపూర్వక కృతజ్ఞతల ద్వారా వాచా కైంకర్యము చేసుకొనుచున్నాము. అరుదైన **"కుట్టిరహస్యములు"** అనే గ్రంథాన్ని మాకు అందించి సహాయపడినవారు, సహృదయులు, ఆంధ్రవిశ్వవిద్యాలయం సంస్కృత విభాగంలో ప్రాచార్యులైన ఉ.వే. శ్రీమాన్ కందాళ కృష్ణమార్యస్వామివారికి మా హార్దికకృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. భాగవతోత్తములు దయతో ఈ గ్రంథాన్ని ఆదరించి దాసులకు మంగళా శాసనములు కటాక్షించాలని ఆశిస్తున్నాము.

ఇట్లు
**భాగవత దాసులు వేదాల సోదరులు**

# విజ్ఞప్తి

నాలాయిర దివ్యప్రబంధాలను వ్యాఖ్యానించేటపుడు నమ్పిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై మొదలైన పూర్వాచార్యులు ఆయా దివ్యప్రబంధ సూక్తులకు సంబంధించిన, అనుగుణమైన ఐతిహ్యాలను, వార్తలను ప్రస్తావించడం ప్రచురంగా కన్పిస్తుంది. వీటివల్ల ఆ ఐతిహ్యాలకు, వార్తలకు సంబంధించిన పూర్వాచార్యుల, వ్యక్తుల స్వరూపస్వభావాలను మనం కొంతవరకు తెలిసికొనే అవకాశం ఏర్పడుతున్నది. అనంతర కాలానికి చెందిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు, శ్రీమణవాళమహాముని, శ్రీవేదాంతదేశికులు మొదలైన పలువురు ఆచార్యవర్యులు కూడా ఈవిధంగా పూర్వులు పల్కిన సూక్తులను తమ గ్రంథాలలో ఉట్టంకించడం ద్వారా ఈ ఒరవడిని అనుసరించారు. భారతదేశ ప్రాచీన చరిత్రకు తగిన ఆధారాలు దొరకడం లేదనే పాశ్చాత్యుల విమర్శకు ఇది ఒక తగిన సమాధానంగా మనం భావించవచ్చు. ఇవి, మన పూర్వాచార్యులకు ఉండే చారిత్రక, సామాజిక స్పృహకు తార్కాణం. పిన్బ(ళ)కియపెరుమాళ్ జీయర్- అనే నమ్పిళ్ళై శిష్యులు నాథమునుల కాలం నుండి తమకాలం వరకు గల పలువురు పూర్వాచార్యులు, విలక్షణ వ్యక్తిత్వాన్ని, పాండిత్యాన్ని కల్గినవారు అపుడపుడు ఆయా సందర్భాలలోను, యాదృచ్ఛికంగాను పల్కిన సుమారు అయిదు వందలకు మించిన సంఖ్యలో వార్తలను "వార్తామాలై" అనే గ్రంథంగా కూర్చి, తరువాతి తరం వారికి ఒక అపూర్వమైన నిధిగా అందించారు.

ఈగ్రంథాలన్నీ ఒక ఎత్తు అయితే, ప్రస్తుతం ముద్రింపబడుతున్న **"తిరుక్కోళూర్ పెణ్‌పిళ్ళై రహస్యమ్"** అనే ఈగ్రంథం వేఱొక ఎత్తు. ఇందులో తిరుక్కోళూర్ దివ్యదేశంలోని ఒక భక్తురాలు భగవద్రామానుజులతో పల్కిన 81 వార్తలు ఉన్నాయి. ఏ సందర్భంలో ఈమె ఈవార్తలను పల్కిందో, అదికూడా గ్రంథారంభంలో ప్రస్తావింపబడింది. ఈ వార్తలన్నీ శ్రీరామాయణం, భారతం, శ్రీభాగవతం, విష్ణుపురాణం, ఆళ్వార్ల, దివ్యప్రబంధాలు మొదలైన వానిలోని అపూర్వాలైన సూక్తులను, సందర్భాలను పురస్కరించుకొని చెప్పబడినవని వీనిని చూస్తే స్పష్టమవుతుంది. ఇవి, ఆ భక్తురాలి జ్ఞానవైభవాన్ని, అనుష్ఠాన వైభవాన్ని, చరమపర్వనిష్ఠాగరిష్ఠతను వ్యక్తం చేస్తున్నాయి. ఇవి సూత్రప్రాయంగా, క్లుప్తంగా మధుర మహార్థభరితంగా భాసిస్తున్నాయి.



దీని మూలం తెలుగులిపిలో పూర్వం ముద్రింపబడింది. వివరణ సాహిత్యాలైన ఈసూక్తులను ఉ.వే.శ్రీమాన్ డా.వి.వి.రామానుజమ్‌స్వామి వారు సుమారు 15 సంవత్సరాలకు పూర్వం ద్రావిడ వివరణంతో ముద్రించారు. అంతకు ముందు కూడా పెద్దలొకరు చేసిన ద్రావిడవివరణం ముద్రింప బడింది. ఈసూక్తులలో కొన్నిటిని **మహామహోపాధ్యాయ ఉ.వే.శ్రీమాన్ న.చ.రఘునాథాచార్యస్వామివారు** (వరంగల్లు) తెలుగులో వివరించి ముద్రించారు. పూర్తిగా అన్నిటికి తెలుగులో వివరణం ముద్రింపబడినట్లు తోచదు. అందువల్లనే ప్రస్తుతం ఇవి తెలుగు విరణంతో ముద్రించే ప్రయత్నం చేయబడుతున్నది.

భగవద్రామానుజ సహస్రాబ్ది సందర్భంగా, ఈవార్తలను వివరణ సహితంగా ప్రకాశింపజేయడం సందర్భోచితమనే భావనతో ఈ ప్రయత్నం చేయబడింది. ఈ గ్రంథముద్రణ కైంకర్యానికి కావలసిన ద్రవ్యాన్ని ఆదరంతో అందించిన మిత్రులు **భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులు ఉ.వే.శ్రీమాన్ వేదాల శ్రీరామాచార్యస్వామి వారిని (విశాఖ)** అభినందిస్తూ, కృతజ్ఞతా విష్కరణను చేసికొంటున్నాను. నా అనువాదాన్ని ప్రీతిపురస్సరంగా కటాక్షించి మంగళాశాసనాలను ప్రసాదించిన **పరమహంసపరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్‌స్వామివారి** సన్నిధిలో సవినయంగా ప్రణమిల్లుతున్నాను. ఈ గ్రంథముద్రణ ఆస్తికలోకాన్ని ఆనందింప జేయగలదని భావిస్తున్నాను. స్వస్తి.

**ఈ. ఏ. శింగరాచార్యులు**



శ్రీమతే రామానుజాయ నమః

# తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై రహస్యమ్

ఒకానొక సమయంలో భగవద్రామానుజులు తిరుక్కోళూర్ అనే దివ్యక్షేత్రానికి వేంచేశారు. అపుడు ఆ ఊరిలోని ఒక వనిత (పెణ్పిళ్ళై) వారికి నమస్కరించి అక్కడ నుండి వెళ్ళబోయింది. అపుడు శ్రీరామానుజులు "అమ్మా! నీవు ఎక్కడకు బయలుదేరావు?" అని ప్రశ్నించారు. ఆమె - "నేను తిరుక్కోళూర్ దివ్యదేశాన్ని విడచివెడుతున్నాను" అని అన్నది. దానిని విని శ్రీరామానుజులు **"తిణ్ణమ్, ఎన్నిళమాన్ పుకుమూర్ తిరుక్కోళూర్"** (ఇది నిశ్చయం, నా కుమార్తె వెళ్ళే ఊరు తిరుక్కోళూరే) అని నమ్మాఴ్వార్ల రీతిలో అందఱు దర్శించే ఊరు తిరుక్కోళూరే కదా! నీకు మాత్రం బయలుదేరి వెళ్ళే ఊరు తిరుక్కోళూర్ అయినదే! నీవెందుకు ఈ దివ్యదేశాన్ని విడచివెడుతున్నావు?" అని అడిగారు. అపుడామె ఈ క్రింది 81 వాక్యాలను విన్నపించింది. ఇవి అన్నీ ఇతిహాస పురాణదివ్య ప్రబంధాదుల లోని, సంప్రదాయానికి చెందిన పలు అపూర్వార్థాలను వెలువరిస్తున్నాయి. ఈవాక్యాలలో ఇమిడి ఉండే అర్థవిశేషాలు సంగ్రహంగా తెలుపబడు తున్నాయి.

## 1. "అఴైత్తు వరుకిఱేన్" ఎన్టేనో, అక్రూరనైప్పోలే"

శ్రీకృష్ణుని వధించాలనే ఉద్దేశ్యంతో ఉండే కంసుడు ధనుర్యాగమనే నెపంతో ఒక వధోపాయాన్ని ఆలోచించాడు. ఆ యాగానికి శ్రీకృష్ణుని, బలరాముని ఆహ్వానించి తీసికొని రావలసినదిగా తన తండ్రికి మంత్రి, తన సహోదరికి భర్త, కుంతీదేవికి, వసుదేవునకు సహోదరుడైన అక్రూరుని పంపించాడు. అక్రూరుడు గొప్ప శ్రీకృష్ణభక్తుడు. మొదట అక్రూరుడు కంసుని దురాలోచనను తెలిసికొని వంచనాబుద్ధితో అతడు చేసే ధనుర్యాగానికి శ్రీకృష్ణబలరాములను నేను ఆహ్వానించి తీసికొని రావడం ఏవిధంగా ? అని



సంకోచించాడు. కాని, తరువాత, శ్రీకృష్ణుడే పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తి - అని తెలిసినవాడు కనుక, శ్రీకృష్ణుని ఈ నెపంతో అయినా దర్శించవచ్చుకదా!" - అనే ఆశతో, "సరే, నీ ఆజ్ఞానుసారం వారిని తీసికొనివస్తాను" అని కంసునితో అన్నాడు.

శ్రీకృష్ణుని కంసుడు పిలవడంలో ఉద్దేశ్యం అతనిని వధించాలనే అయినా ఆ సర్వేశ్వరుని దర్శించే గొప్ప అవకాశం కల్గిందని అక్రూరుడు వారిని పిలుచుకొని రావడానికి అంగీకరించాడు. నేను కూడా ఆవిధంగా స్వామిని దర్శించి పిలుచుకొని రావడానికి అక్రూరునివలె అంగీకరించానా? లేదుకదా!- అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై **"అక్రూరనైప్పోలే అఴైత్తు వరుకిఱేన్ - ఎన్టేనో"** అని పల్కింది. ఇది శ్రీవిష్ణుపురాణంలోని వృత్తాంతం. **"ఇత్యాజ్ఞప్త స్తథాక్రూరో మహాభాగవతో ద్విజ, ప్రీతిమానభవత్ కృష్ణం శ్వో ద్రక్ష్యామీతి సత్వరః", "అక్రూరోపి వినిష్క్రమ్య స్యందనేనాశుగామినా, కృష్ణ సందర్శనాకాంక్షీ ప్రయయౌ నందగోకులమ్, చింతయామాస చాక్రూరో నాస్తి ధన్యతమో మయా, యోహ మంశావతీర్ణస్య ముఖం ద్రక్ష్యామి చక్రిణః"** అనే శ్లోకాలు స్మరణీయాలు.

## 2. అక మొఴిత్తువిట్టేనో, విదురనైప్పోలే

శ్రీకృష్ణుడు పాండవులకోసం హస్తినాపురికి దూతగా వెళ్ళినపుడు భీష్ముడు, ద్రోణుడు అశ్వత్థామ, విదురుడు మొదలైనవారు అతనికి స్వాగతం పల్కి ఆహ్వానించారు. భీష్ముడు "నేను జ్ఞానాధికుడను కనుక, నా ఇంటికే శ్రీకృష్ణుడు విందును ఆరగించడంకోసం వస్తాడు" అని తలచాడు. ద్రోణుడు "జాతినిబట్టి నేను ఉన్నతుడను కనుక నా ఇంటికే శ్రీకృష్ణుడు భుజించాలని వస్తాడు." అని భావించాడు. ఈ విధంగా ఎవరికి వారు, తమ ఇంటికే కృష్ణుడు వస్తాడనుకొన్నారు. విదురుడు మాత్రం "అల్పజ్ఞుడనైన నేను శ్రీకృష్ణుని ఏవిధంగా విందుకు ఆహ్వానించగలను?" అని సంకోచించాడు.

**"ఉళ్ళువారుళ్ళగ్రైల్లామ్ ఉడనిరున్దఱిదు"** (స్వామీ! నీవు భక్తుల మనస్సు లోపల నివసిస్తూ, వారి మనస్సులోని భావాన్ని గ్రహిస్తావు) అనే ఆఴ్వార్ల సూక్తి రీతిలోని శ్రీకృష్ణుడు ఎవరెవరు ఏయే రీతిలో భావిస్తారో

తెలియగలడుకదా! శ్రీకృష్ణుడు తాను వెళ్ళే దారిలోని గృహాలను అన్నిటిని వేలుతో నిర్దేశించి చూపిస్తూ, సారథిని "ఇది ఎవరి గృహం? ఇది చివరి గృహం?" అని అడుగుతూ వెళ్ళాడు. చివరగా విదురుని గృహం రాగానే "ఇది ఎవరి ఇల్లు?" అని ప్రశ్నించగా, దగ్గరలో ఉండే విదురుడు "ఇది దేవరవారి తిరుమాళిగ" అని తన ఇంటిని ఉద్దేశించి అన్నాడు. దీనిని ఆలకించిన శ్రీకృష్ణుడు, "ఓహో! అలాగా! ఇక్కడకూడా నాకొక ఇల్లు ఉన్నదా!" అని అంటూ, విదురుని ఇంటిలోనికి ఆనందంగా ప్రవేశించాడు.

**"నీర్ నుమదు ఎన్ఱివై వేర్ముదల్ మాయ్**త్తిఱ్ఱు **ఇఱై శేర్మిన్"** (తిరువాయ్-1-2) (నేను, నాది- అనే భావాలను పూర్తిగా వదలపెట్టి, స్వామిని ఆశ్రయించండి) అని నమ్మాళ్వార్లు ఉపదేశించారు. అదే విధంగా, విదురుడు కూడా "నేను, నాది" అనే భావనను విడచి, ఆంతర, బాహ్య సంపర్కాలను విడచిపెట్టాడు. **"యానే నీ, ఎన్నుడమైయుమ్ నీయే"** అని తాను, తన సొత్తు అంతా భగవంతునిదే అని అన్నాడు. "ఈ విధంగా నేను కూడా అన్నానా? అనలేదు కదా అనేభావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"విదురరైప్పోలే అకమొழిన్దు విట్టేనో?"** అని పల్కినది. ఇది మహాభారతంలోని వృత్తాంతం.

### 3. దేహత్తై విట్టేనో, ఋషిపత్నికళైప్పోలే

శ్రీకృష్ణుడు అరణ్యంలో తోటి గోపాలకులతోపాటు లేగదూడలను, ఆవులను మేపుతూ ఉండే సమయంలో గోపాలకులు శ్రీకృష్ణుని చూచి, "మాకు చాలా ఆకలిగా ఉన్నది అది తీరే ఉపాయం ఏదైనా చూడు" అని అన్నారు. అపుడు శ్రీకృష్ణుడు "ఇక్కడకు సమీపంలో బ్రాహ్మణులు కొందఱు ఆంగీరసమనే దీర్ఘకాలిక సత్రయాగాన్ని చేస్తున్నారు. మీరు వారిదగ్గరకు వెళ్ళి, నా పేరు చెప్పి అన్నాన్ని అడిగి తీసుకొని రండి" అని అన్నాడు. వారక్కడకు వెళ్ళి ఆ విధంగానే సత్రయాగాన్ని చేసే ఋషులతో తాము శ్రీకృష్ణుని స్నేహితులమని పల్కి తమకు అన్నాన్ని పెట్టమని అర్థించారు. కాని, ఆ బ్రాహ్మణులు ఏమీ బదులు పల్కలేదు. గోపాలకులు శ్రీకృష్ణుని దగ్గరకు తిరిగి వచ్చి ఈ విషయాన్ని తెలిపారు. శ్రీకృష్ణుడు అయితే, "ఋషుల భార్యల దగ్గరకు వెళ్ళి అడగండి. వారు తప్పకుండా మీకు అన్నం పెడతారు."-



అన్నాడు. వారు కూడా ఆ రీతిలోనే మళ్ళీ ఋషిపత్నుల దగ్గరకు పోయి అన్నాన్ని పెట్టమని అడిగారు. ఆ ఋషిపత్నులు వారిని అడిగి, విషయాన్ని గ్రహించి, పలు విధాలైన వంటకాలను తయారుచేసి, తామే తీసికొని వచ్చి, వారికి పెట్టారు. వారితో పాటు వచ్చి శ్రీకృష్ణుని దర్శించి ఆ ఋషిపత్నులు ఆనందించారు.

తరువాత, శ్రీకృష్ణుడు వారిని తమ తమ భర్తల వద్దకు తిరిగి వెళ్ళవలసినదిగా పలికాడు. వారు, తమ భర్తలు కోపిస్తారని భయపడి వారి దగ్గరకు వెళ్ళడానికి సంశయించారు. శ్రీకృష్ణుడు వారి భయాన్ని తీర్చి, వారి భర్తలు కోపించకుండా ఉండే రీతిలో అనుగ్రహించి వారిని వెళ్ళమని నియమించాడు. ఋషిపత్నులు కూడా తిరిగి వెళ్ళారు. కాని, ఒక్కతె మాత్రం శ్రీకృష్ణుని విడచి వెళ్ళలేక, శ్రీకృష్ణునే ధ్యానిస్తూ ప్రాణాలను త్యజించింది.

ఈ విధంగా ప్రాణాన్ని కూడా లెక్కించకుండా, భగవంతుని మనస్సులో ధ్యానించే ఋషిపత్ని వలె ఆర్తిని కల్గినదాననా, నేను? కాను కదా" అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"ఋషిపత్నియైప్పోలే దేహత్తై విట్టేనో!"** అని పల్కినది. ఇది శ్రీభాగవతవృత్తాంతం. **"తత్రైకా విధృతా భర్త్రా భగవంతం యథాశ్రుతమ్, హృదోపగుహ్య విజహౌ దేహం కర్మానుబంధనమ్"** అనే భాగవత శ్లోకం స్మరణీయం. (భాగవతమ్-10-23-34)

### 4. దశముఖనై చ్చెఱ్ఱేనో, పిరాట్టియైప్పోలే :

**"శెమ్బొన్ నీళ్ముడి ఎజ్గళ్ ఇరావణన్ శీఱ్ఱై ఎన్పదోర్ దెయ్వమ్ కొణర్న్దు వమ్బులామ్ కడికావిల్ శిఱైయావైత్తదే కుఱ్ఱమాయిఱ్ఱు"** అని, **"ఇరక్కమిన్ ఎజ్కోన్ శెయ్ద తీమై ఇమ్మైయే ఎమక్కెయ్దిఱ్ఱు ... ఇరావణన్ పట్టాన్"** ఎన్నుమ్, **"దణ్డకారణియమ్ పుకున్దు అన్దు తైయలై... కొణ్డుపోన్దు కెట్టాన్, పెణ్డిరాల్ కెడుమ్ ఇక్కుడి"** అని లంకలోని రాక్షసులు పల్కినట్లుగా పిరాట్టి పాతివ్రత్య ప్రభావం చేత దశముఖ అనే రావణుడు నశించాడు. సీతాదేవి పాతివ్రత్యమే రావణుని నాశనానికి హేతువైనది.

దశముఖుని కోపాన్ని ఏ కొంచెం లెక్కించకుండా "తన భర్తయే తనకు దైవం" - అని సీతాదేవి దృఢనిశ్చయం కల్గి ఉన్నది. ఇంతే తప్ప, వేఱొక దైవాన్ని భావించలేదు. శ్రీరామచంద్ర స్వామియే సర్వస్వమని భావించింది.

ఈ రీతిలోని దృఢనిశ్చయం దాసురాలకు ఉన్నదా? అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"పిరాట్టియై ప్పోలే దశముఖనై చ్చెగ్రైనో?"** అని పల్కింది. ఇది శ్రీరామాయణంలోని వృత్తాంతం.

**5. "పిణమెழுప్పివిట్టేనో, తొణ్డైమానై ప్పోలే"**

కూర్మడనే వైదిక బ్రాహ్మణుడు ఒకడు కాశీనగరాన్ని దర్శించాలని ఆశపడ్డాడు. కాని, తన ఆశ తీరకుండానే పరమపదించాడు. అతని కుమారుడు కృష్ణశర్మ. తన తండ్రి అస్థికలను అయినా కాశికి వెళ్ళి గంగలో కలపాలని తలచాడు. చిన్న వయస్సులో ఉండే తన భార్యను, మూడు నెలల చంటిబిడ్డను తీసికొని, కాలి నడకతో ప్రయాణమయ్యాడు. కాని, అతని భార్య అంతదూరం నడవలేకపోయింది. తన భార్యను, బిడ్డను ఎవరి దగ్గర అయినా అప్పగించి, తాను మాత్రం ప్రయాణం చేయవచ్చునని భావించాడు. అపుడతడు, వీరిని దయాస్వభావుడైన తొణ్డమాన్ చక్రవర్తి దగ్గర అప్పగించడం తగినది- అని నిశ్చయించుకొని అతని వద్ద వారిని అప్పగించి, మనస్సులో నెమ్మదిని పొంది ప్రయాణం సాగించాడు. ఆ విధంగా కృష్ణశర్మ భార్యాపుత్రుల రక్షణ బాధ్యతను స్వీకరించిన తొండైమాన్ చక్రవర్తి, వారికి సురక్షితమైన చోటును ఏర్పాటు చేసి, అక్కడ సకలసౌకర్యాలను ఏర్పాటు ఇచ్చాడు. ఆ తరువాత రాజపరిపాలన వ్యగ్రతవల్ల వారిని గూర్చి పూర్తిగా మరచిపోయాడు.

తరువాత, కృష్ణశర్మ తండ్రి అస్థికలను గంగలో కలిపి, గంగాతీర్థాన్ని తీసికొని తిరిగి వచ్చాడు. చక్రవర్తికి తీర్థాన్ని ఇచ్చి, తన భార్యను కుమారుని చూడాలని ఉన్నదని అన్నాడు. అపుడు తొండమాన్ చక్రవర్తికి అతని భార్య, కుమారుడు స్మరణకు వచ్చారు. వెంటనే అతడు వేగంగా భయంతో వెళ్ళి వారిని చూచాడు. కాని, వారు, అప్పటికి చాలా దినాలుగా ఆహారం లేనందున, ఆకలిబాధతో చిక్కి, చివరకు మరణించారు. దానిని చూచిన రాజుకు అపుడు ఏం చేయాలో, ఏమని కృష్ణశర్మకు బదులివ్వాలో తెలియలేదు. అతడు కృష్ణశర్మ దగ్గరకు వచ్చి, వారు తన అంతఃపురస్త్రీలతో కలసి శేషాచలానికి యాత్రగా శ్రీనివాసుని దర్శనార్థం వెళ్ళి ఒక వారం అయినదని, రెండు దినాలలో తిరిగి రాగలరని అసత్యం పల్కి, అప్పటి ఆపదనుండి తాత్కాలికంగా తప్పించుకొన్నాడు.



తొండైమాన్ చక్రవర్తి వేంకటేశ్వరుని భక్తుడు. అందువల్ల అతడు మనస్సులో శ్రీనివాసుని స్మరించి, నమస్కరించి, "ప్రభూ! ఆపద్బాంధవా! అనాథరక్షకా! దీనబంధూ! దయానిధీ! నన్ను ఈ ఆపదనుండి తప్పించు. లేకపోతే, నన్ను నీ శ్రీచరణాలవద్దకు చేర్చుకో!'' అని పలుమార్లు వేదనతో ప్రార్థించాడు. అతని వేడికోలుకు శ్రీనివాసుని మనస్సు కరిగింది. అతడు ప్రత్యక్షమై, మృతశరీరాలను తీసికొని రమ్మని ఆజ్ఞాపించాడు. ఆ విధంగానే చక్రవర్తి వారి శవాలను తీసికొని రాగానే, వారిని స్వామి తన శక్తితో తిరిగి బ్రతికేటట్లు చేశాడు.

వెంటనే తొండైమాన్ చక్రవర్తి కూడా ఆనందపరవశుడై, వారిని తీసికొని వెళ్ళి, కృష్ణశర్మకు అప్పగించాడు. అతడు కూడా సంతోషించి భార్యతో, తన బిడ్డతో తిరిగి వెళ్ళాడు.

"ఈ విధంగా తొండమాన్ వలె సాటి లేని భక్తితో అసాధ్యమైన కార్యాన్ని సాధించానా? లేదుకదా'' అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"తొణ్డైమానై ప్పోలే పిణమ్ ఎழுప్పివిట్టేనో!"** అని పల్కింది. ఇది పురాణాంతర్గత శ్రీవేంకటాచలమాహాత్మ్య వృత్తాంతం.

**6. "పిణవిరున్దిట్టేనో, ఘంటాకర్ణనై ప్పోలే!"**

శివుని భూతగణాలలో ఒకడు మితి మీరిన శివభక్తికారణంగా విష్ణుద్వేషాన్ని కలవాడై, విష్ణునామం కూడా తన చెవులలో పడరాదని తన చెవులకు రెండిటికి గంటను కట్టుకొని, వాటిని మోగించుకొంటూ ఉన్నందున ''ఘంటాకర్ణుడ''నే పేరును పొందాడు. అతడు శివుని గూర్చి పలు సంవత్సరాలు తపస్సు చేసి, తనకు ముక్తిని అనుగ్రహించమని శివుని అర్థించాడు. శివుడపుడు "మోక్షాన్ని ఇవ్వడానికి శక్తి కలవాడు లక్ష్మీపతియే. ఇహలోకంలోని ఫలాన్ని దేనినైనా అడుగు; దానిని ఇస్తాను'' అని అన్నాడు. అపుడు ఘంటాకర్ణుడు శివుని ఆరాధించడం మాని, తన చెవులకు కట్టుకొన్న గంటను తీసి దూరంగా పారవేశాడు. శివునకు స్నేహితుడైన కుబేరుని దగ్గరకు వెళ్ళి, జరిగిన సంగతిని అతనికి తెలిపాడు. అపుడు కుబేరుడు "నిత్యమైన పదాన్ని హరియే ఇవ్వగలడు.'' అని పల్కి అతనికి అష్టాక్షరీ మహామంత్రాన్ని,

ద్వాదశాక్షరీమంత్రాన్ని, ఉపదేశించడమే కాక, ఆ సమయంలో హరి శ్రీకృష్ణుడై ద్వారకలో అవతరించాడని కూడా తెలిపాడు. ఎంతటి దుష్కర్మను కల్గి ఉన్నా విష్ణునామాన్ని ఉచ్చరిస్తే చాలు, ఆ దుష్కర్మ నశిస్తుందని అన్నాడు. ఘంటాకర్ణుడు శ్రీకృష్ణుని దర్శించడానికి బయలుదేరి ద్వారకకు వెళ్ళాడు. అక్కడ శ్రీకృష్ణుని కలసి, తాను చంపి తీసికొని వచ్చిన శవాన్ని విందుగా అర్పించి, ఆరగించమని అన్నాడు.

శ్రీకృష్ణుడు అతని ప్రార్థనను అంగీకరించి, అతనికి మోక్షాన్ని ఇచ్చాడు. ఘంటాకర్ణుడపుడు, తన తమ్ముడైన దంతవక్త్రునకు కూడా ముక్తిని కల్గించమని అర్థించగా, శ్రీకృష్ణుడావిధంగానే అనుగ్రహించాడు.

దీనిని తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"ఘంటాకర్ణనైప్పోలే పిణవిరున్దిట్టేనో!"** అని ప్రస్తావించింది. ఇది హరివంశంలోని వృత్తాంతం. **"అఙ్గణ్ మాఞాలమ్"** (పెరియతిరుమొழி-1-7-10) పాశురవ్యాఖ్యలో ప్రస్తావింపబడింది.

## 7. "తాయ్‌క్కోలమ్ శెయ్‌దేనో, అనసూయ యైప్పోలే"

అనసూయ అత్రిమహర్షిభార్య, ఈమె పతివ్రతా శిరోమణి. భర్తయే. దైవమనే నమ్మకాన్ని కల్గినది. ఈమె పతిభక్తిని, శీలగుణమహిమను బాగా గ్రహించినవారు - నారదాది మహర్షులు.

శ్రీరాముడు అరణ్యవాస సమయంలో సీతాదేవితోపాటు అత్రిముని ఆశ్రమానికి వెళ్ళాడు. అపుడు, సీత అనసూయకు నమస్కరించింది. అనసూయ, సీతాదేవి సౌందర్యాన్ని చూచి ఆశ్చర్యపడి, సీతాదేవికి పట్టుచీరను కట్టి, పూలను చుట్టి అలంకారం చేసి, పలు ధర్మాలను బోధించింది. **"సా త్వేవ ముక్తా ధర్మజ్ఞా తయా ప్రీతితరాభవత్, సఫలం చ ప్రహర్షం తే హంత సీతే కరోమ్యహమ్, ఇదం దివ్యం వరం మాల్యం. వస్త్ర మాభరణాని చ, అంగరాగం చ వైదేహి! మహార్హం చానులేపనమ్, మయా దత్తమిదం సీతే తవ గాత్రాణి శోభయేత్, నగరస్థో వనస్థో వా పాపో వా యది వా శుభః, యాసాం స్త్రీణాం ప్రియో భర్తా తాసాం లోకా మహోదయాః, స్త్రీణామార్య స్వభావానాం పరమం దైవతం పతిః, భవస్వ భర్తుః సహధర్మచారిణీ యశశ్చ ధర్మం చ తతః సమాప్స్యసి"** అనే శ్రీరామాయణ శ్లోకాలు ఇక్కడ స్మరణీయాలు.



తల్లివలె చాలా ప్రేమతో సీతను ఆదరించినందున అనసూయ సీతపట్ల తల్లివలె వర్తించింది - అని అనడం యుక్తంకదా! అనసూయాదేవి జగజ్జనని అయిన సీతాదేవికి, తల్లివలె, పట్టుచీర, నగలను అలంకరించి, ఆమె అందాన్ని చూచి ముగ్ధురాలైనది.

అనసూయ పొందిన ఇటువంటి అవకాశం, ఆనందం నాకు కలిగిందా? లేదుకదా! - అనే భావనతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై- **"అనసూయైప్పోలే తాయ్‌క్కోలమ్ శెయ్‌దేనో!"** అని అన్నది.

## 8. "తన్దై ఎఙ్గే? ఎన్డేనో, తురువనైప్పోలే"

ఉత్తానపాదుడనే ప్రభువుకు సునీతి, సురుచి - అని ఇద్దరు భార్యలుండేవారు. సునీతికి ధ్రువుడు, సురుచికి ఉత్తముడు కుమారులుగా కలిగారు. ఉత్తానపాదుడు, సౌందర్యవతి అయిన సురుచి విషయంలోనే ఎక్కువ మక్కువను కలిగి ఉండేవాడు. ఆఱు సంవత్సరాల బాలుడైన ధ్రువుడు మహాజ్ఞాని. అతడొకనాడు సురుచి అంతఃపురానికి వెళ్ళాడు. అపుడు ఉత్తానపాదుడు సురుచి కుమారుడు ఉత్తముని సింహాసనంలో తన ఒడిలో కూర్చుండబెట్టుకొని, ముద్దుచేస్తున్నాడు. దీనిని చూచి తాను కూడా ఆ విధంగానే తండ్రి ఒడిలో కూర్చోవాలని ఆశతో అతని దగ్గరకు ధ్రువుడు వెళ్ళాడు. అపుడు సవతి తల్లి సురుచి "నీకు ఈ విధంగా నీ తండ్రి ఒడిలో కూర్చొనే యోగ్యత లేదు. నీవు ఆశపడినట్లు తండ్రి ఒడిలో కూర్చోవాలంటే, నా కడుపున నీవు పుత్రుడుగా పుట్టాలి'' అని అంటూ గెంటివేసింది. ఆ మాటలకు, ఆమె చేష్టలకు దుఃఖాన్ని పొంది ధ్రువుడు తండ్రివైపు చూచాడు. అతడు సురుచిపై ఉండే మోహంవల్ల ఏమీ పలుకకుండా, తలవంచుకొన్నాడు. ధ్రువుడపుడు తల్లి సునీతి దగ్గరకు వెళ్ళి, జరిగిన సంగతిని తెలిపి రోదించాడు. సునీతి "నాయనా! లోకానికి అంతటికి తండ్రి అయిన పరమాత్మను ఉద్దేశించి తపస్సు చేసి, ఆ స్వామిసన్నిధిలో నీ అభీష్టాన్ని విన్నవించు. దానిని పొందవచ్చు'' అని అన్నది.

ధ్రువుడు "తల్లీ! ఆ తండ్రి ఎక్కడ ఉన్నాడు?'' అని ప్రశ్నించగా, సునీతి "నీవు వనానికి వెళ్ళి, తపస్సు చేస్తే, ఆ తండ్రిని దర్శించవచ్చు'' అని

పల్కింది. ధ్రువుడు ఆ విధంగానే, తల్లి అనుమతితో, సమీపంలో గల అరణ్యానికి వెళ్ళి, సప్తర్షుల ద్వారా ద్వాదశాక్షరమంత్రాన్ని ఉపదేశంగా పొంది, తీవ్రమైన తపస్సును చేశాడు. ఆ మంత్రప్రభావంవల్ల శ్రియఃపతి అనుగ్రహాన్ని పొంది, అన్ని నక్షత్రాలకు పైన ఉండే ఉత్తమపదవిని పొందాడు. ఈ నాటికీ అతడు అంతరిక్షంలో ధ్రువనక్షత్రంగా ప్రకాశిస్తున్నాడు.

మనం పొందే జ్ఞానం, ఆత్మలన్నిటికీ తండ్రి అయిన పరమాత్మను పొందడం కోసమే. ఉపయోగపడాలి చిన్నవాడైన ధ్రువుడు పరమాత్మను "జగత్పిత ఎక్కడ ఉన్నాడు? అని అన్వేషించినట్లుగా నేను అన్వేషించానా?'' అని అంటూ తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై "ధ్రువనైప్పోలే తన్దై ఎజ్గే ఎన్ఱేనో!" అని అన్నది. ఇది శ్రీవిష్ణుపురాణంలోని, భాగవతంలోని వృత్తాంతం.

**9. "మూన్ఱెழుత్తు చ్చొన్నేనో, క్షత్రబంధువైప్పోలే"**

ఒక ఊరిలో చాలా క్రూరమైనవాడొకడు ఉండేవాడు. అతడు ఆ ఊరిలో ఉండే మగవారిని, ఆడవారిని, బాలురను, శిశువులను, పశువులను అందఱిని బాధించేవాడు. అతని బాధను భరించలేక ఆ ఊరిలోనివారు ఆ ఊరి ప్రభువు వద్దకు పోయి రక్షించమని మొఱపెట్టారు.

అతనికి సరి అయిన దండనను విధించాలని తలచి, "క్షత్రబంధువు''- (అనే అర్థంలో ఇక్కడ బంధుశబ్దం వ్యతిరేకలక్షణా ప్రక్రియలో ప్రయోగింపబడింది) అనే నింద్యమైన పేరును అతనికి పెట్టి, అతనిని అరణ్యంలోకి తీసికొనిపోయి విడచిపెట్టమని ప్రభువు ఆజ్ఞాపించాడు. ఆ క్షత్రబంధువు అక్కడకూడా తన క్రూరకృత్యాలను మానలేదు. ఆ విధంగా అతడు క్రూరంగా వర్తించే సమయంలో, ఒకనాడు ఒకముని చాలా ఎండవేళలో ఉండే దారిలో ప్రయాణం చేస్తూ, దారి తప్పి, క్షత్రబంధువుండే చోటుకు వచ్చాడు. అతని కంటికి కన్పించాడు. ఆ మునిని చూడగానే క్షత్రబంధువు తనకు తెలియకుండా, అప్రయత్నంగా "ఓ మునీ! ఇది మీరు రావలసిన దారి కాదే! దారి తప్పి వచ్చారు కదా!'' అని ఆ మునిని చూచి అన్నాడు. అపుడా ముని సహించలేని దాహంతో బాధపడుతున్నాడు. అతడొక సరస్సును చూచి తాపం తీరాలని వేగంగా ఆ సరస్సులోకి వేగంగా దిగాడు. కాని,



మునిగిపోబోయాడు. అపుడు క్షత్రబంధువు తన చేతిలోని వింటిని బాణాలను దూరంగా పారవేసి, సరస్సులో మునిగిపోతున్న మునిని పైకి తీసికొని వచ్చి, ఒడ్డుకు చేర్చి రక్షించాడు. చల్లని తామరతూడులను అతనికి ఆహారంగా ఇచ్చి, అతని దాహార్తిని తీర్చి, ఆనందించాడు. అపుడాముని సేదదీరి ఒక కొయ్యపై కూర్చున్నాడు. క్షత్రబంధువు ఆ ముని పాదాలను మెల్లగా ఒత్తుతూ అతనికి కల్గిన మార్గాయాసాన్ని తీర్చాడు.

మునికి శ్రమ తీరింది. కొంచెం సేపు నిద్రించిన తరువాత అతడు లేచి "నాయనా! ఎవరు నీవు? నీ వృత్తాంతమేమి?'' అని ప్రశ్నించాడు. అపుడు క్షత్రబంధువు - "స్వామీ! నేను దుష్కర్మలను చేసే మహాపాపిని. నాకు మానవుడు కాని, మృగం కాని- ఏది కన్పించినా, ఇదిగో! ఈ కత్తితో నఱికి ఖండించడం అలవాటు. అందువల్ల నన్ను నగరంలో ఉండనీయకుండా తరిమికొట్టారు. ఇక్కడ కూడా ఆక్రూరవృత్తినే చేస్తున్నాను'' అని అన్నాడు.

దానిని విని ఆ మునికి అతనిపై చాలా దయ కల్గింది. అతనిని చూచి "నీవు నా పట్ల చాలా దయాళువుగా వర్తించావు. ఇకపై నీ పాపపు పనులు మానుకో'' అని ఎంతగానో అతనికి ఉపదేశించాడు. కాని, క్షత్రబంధువు "నేను ఆ పనులను చేయకపోతే జీవించలేను'' అని తిరస్కరించాడు. అయినా ఆ ముని మనస్సు అతనిపట్ల చాలా జాలిపడి - "నేను నీకొక మంత్రాన్ని ఉపదేశిస్తాను. దానిని నిరంతరం జపించు'' అని మూడక్షరాలను కల గోవిందనామాన్ని అతనికి ఉపదేశించాడు.

క్షత్రబంధువు దానిని సదా మననం చేస్తూ వచ్చాడు. దాని ఫలంగా అతని పాపకర్మలు అన్నీ క్రమంగా అగ్నిలోపడిన దూదివలె నశించిపోయాయి. తరువాత అతడు భగవత్సేవలో ఆసక్తుడయ్యాడు. ఈ వృత్తాంతాన్నే తొండరడిప్పొడి ఆழ்వార్లు తమ తిరుమాలై ప్రబంధంలో - **"మొయ్త్త వల్వినైయుళ్ నిన్ఱు మూన్ఱెழుత్తుడైయ పేరాల్ కత్తిరబందుమన్ఱే పరాజ్గతి కణ్డు కొణ్డాన్"** ఇత్యాదిగా అనుసంధించారు.

ఈ విధంగా క్షత్రబంధువు పల్కిన మూడక్షరాలు కల భగవన్నామాన్ని నేను నా నోటితో ఉచ్చరించానా? లేదుకదా?- అనే భావంతో తిరుక్కోళూర్

ప్పెణ్పిళ్ళై **"క్షత్రబంధువైప్పోలే మూన్ఱైழுత్తు చ్చొన్నేనో!"** అని అన్నది. ఇది హరివంశంలోని వృత్తాంతం.

10. **"ముదలడియై ప్పెఱ్ఱేనో, అకలిఱైప్పోలే!"**

గౌతమమహర్షి ధర్మపత్ని అహల్య, తన భర్త ఇచ్చిన శాపం కారణంగా శిలగా (శిలాసదృశంగా) చిరకాలం పడి ఉన్నది. శ్రీరాముడు విశ్వామిత్రుని యాగాన్ని రక్షించి, ఆ మునితో పాటు మిథిలకు వెళ్ళేటపుడు దారిలో శ్రీరాముని శ్రీపాదధూళి ఆమెపై పడగా గౌతముడు ఆమెకిచ్చిన శాపం తీరి, శిలారూపం పోయి స్త్రీరూపాన్ని పొందింది. ఆ విధంగా శాపంనుండి విముక్తురాలైన అహల్య అపుడు శ్రీరామునకు నమస్కరించి, తన భర్త గౌతమమునిని చేరి ఆనందించింది.

ఆ విధంగా నేను కూడా అహల్యవలె లోకమూలమైన సర్వేశ్వరుని శ్రీచరణాల స్పర్శను పొందగలిగానా? - అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"అకలిఱైప్పోలే ముదలడియైప్పెఱ్ఱేనో!"** అని పల్కింది. ఇది శ్రీరామాయణంలోని వృత్తాంతం.

11. **"పిఞ్జాయ్ ప్పழுత్తేనో, ఆణ్డాళైప్పోలే"**

**"పెరియాழ்వార్ తిరుమకళార్"** (భట్టనాథ పుత్రిక) అయిన ఆణ్డాళ్ చిన్నతనం నుండి భగవంతుని పట్ల భక్తిపూర్వకమైన అనురాగాన్ని కల్గినదై, ఆ స్వామినే వివాహమాడాలని ఆశపడింది. ఆ స్వామి మహిమలనే సదా చింతిస్తూ, స్తుతిస్తూ కాలక్షేపాన్ని చేసింది. అయిదేళ్ళ వయస్సులోనే పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులను పొందింది. అంతేకాక, ఆమె, **"మానిడవర్కెన్ఱు ప్పేచ్చుప్పడిల్ వాழகిల్లేన్"** (మానవులు నన్ను వివాహమాడతారనే మాట మాత్రం అయినా నా చెవిలో సోకితే చాలు, నేను జీవించలేను) అని, శ్రీరంగనాథుడే భర్తగా వరించానని అన్నది.

ఈవిధంగా, ''నేను చిన్నతనంలోనే గోదాదేవివలె పిందెదశలోనే ఫలపరిణామాన్ని పొందానా? - లేదుకదా! అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్ పిళ్ళై **"పిఞ్జాయ్ ప్పழுత్తేనో, ఆణ్డాళైప్పోలే"** అని పల్కింది. ఇది గోదాదేవి చరిత్రకు చెందిన వృత్తాంతం.



12. **"ఎమ్బెరుమానెన్ఱేనో, పట్టర్పిరానైప్పోలే"**

**'పాణ్డియన్ కొణ్డాడ ప్పట్టర్ పిరాన్ వన్దానెన్ఱు ఈణ్డియ శజ్ఞ మెడుత్తూద- వేణ్డియ వేదజ్గళోది విరైన్దు కిழி యఱుత్తాన్"** (పాండ్యరాజు భట్టనాథులు వచ్చారని కీర్తించగా, శంఖధ్వని మోగుతూ ఉండగా, వేదవాక్యాలను పల్కి పరతత్త్వనిర్ణయం చేసి, వాదశుల్కాన్ని పెరియాழ்వార్లు పొందారు.) అని ఈ రీతిలో శ్రీమన్నారాయణుడే దైవమని పాండ్యరాజు సభలో వాదించి, పరతత్త్వ నిర్ణయాన్ని చేసి, వాదశుల్కాన్ని జయించిన భట్టనాథులు **"ఎన్నాళ్ ఎమ్బెరు మాన్ ఉన్ఱనక్కడియోమెన్ఱు ఎழுత్తుప్పట్ట అన్నాళే అడియోజ్గళ్ అడిక్కుడిల్ వీడుపెఱ్ఱు ఉయ్న్దదుకాణ్"** (స్వామీ! మేము నీకు దాసులమని అంగీకరించామో, ఆనాటినుండి మాకులమంతా ఉజ్జీవించింది.) అని అన్నారు. ఇంతేకాక, మధురాపురిలో **"శిలై కునిత్తు ఐన్దలైయ పైన్నాగత్తలై ప్పాయ్న్దవనే! ఉన్నై ప్పల్లాణ్డు కూఱుదుమే"** (విల్లును వంచి, అసురులను వధించి, అయిదు తలలు గల కాళియుని ఆక్రమించివాడా! నీకు పల్లాండు పల్కుతాం) అని భగవంతునకు పల్లాండు పాడారు.

పెరియాழ்వార్ పరత్వనిర్ణయం చేసినపుడు పాండ్యరాజు, వారిని **"పట్టర్పిరాన్"** అని పొగడారు. ఆ ఆழ்వార్లు భగవంతుని **"ఎమ్బెరుమాన్"** అని కీర్తించారు. ఈ విధంగా సర్వేశ్వరుని నేను భక్తితో కీర్తించానా?- లేదుకదా! అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"పట్టర్పిరానైప్పోలే ఎమ్బెరుమాన్ ఎన్ఱేనో!"** అని పల్కింది. ఇది భట్టనాథచరిత్రలోని వృత్తాంతం.

13. **"ఆరాయ్న్దువిట్టేనో, తిరుమழிశైయాழ்వార్పోలే"**

ఆழ்వార్లలో ఒకరైన తిరుమழிశైప్పిరాన్ "పరతత్త్వం ఏది?'' అని పరిశీలించి చూచారు. లోకాయతం, (చార్వాకం), బౌద్ధం, జైనం- మొదలైన అవైదిక (బాహ్య) మతాలను, మాయావాదం మొదలైన అప్రామాణికాలైన వైదికమతాలను ప్రత్యేక ప్రత్యేకంగా అనుశీలనం చేసి, వానిని విచారించారు. ఆ యా మతాలను కొంతకాలం అవలంబించి, అవి నిస్సారాలని తెలిసికొన్నారు. ఆ మతాలలోని లోపాలను గమనించి, చివరకు శైవమతమే నిజమైన మతమని నిశ్చయం చేసికొన్నారు. అందులో గాఢంగా ఆసక్తులై, **"శివవాక్కియర్"** అనే

బిరుదును కూడా పొందారు. శివుని స్తుతిస్తూ గ్రంథాలను రచించి, పరమశివుని ఆరాధించారు.

ఈ విధంగా ఉండగా ఒకనాడు, పేయాళ్వార్లు తిరుమళిశై ఆళ్వార్లను కలిశారు. అపుడు వారిమధ్య "ఎవరు పరతత్త్వం?'' అనే విషయాన్నిగూర్చి పెద్ద వాదం జరిగింది. చివరలో వాదాన్ని గెల్చిన పేయాళ్వార్లు తిరుమళిశైప్పి రాన్‌ను శిష్యులుగా చేసికొని, వారు శైవాన్ని విడచి, వైష్ణవులుగా అయేటట్లు చేశారు. అప్పటినుండి తిరుమళిశైప్పిరాన్ వైష్ణవ సిద్ధాంతాన్ని లోతుగా అవగాహించి, పరమభక్తాగ్రేసరులయ్యారు.

**"శాక్కియమ్ కర్ద్రోమ్ శమణ్ కర్ద్రోమ్ శఙ్కరనార్ ఆక్కియ ఆగమనూలారాయ్‌న్దోమ్ - పాక్కియత్తాల్ శెఙ్గట్కరియానై చ్చేర్‌న్దోమ్"** (శాక్య మతాన్ని అభ్యసించాను, జైనమతాన్ని అభ్యసించాను. శంకరుడు రచించిన శైవాగమ గ్రంథాలను పరిశీలించాను. అదృష్టవశంచేత పుండరీకాక్షుడైన నీలవర్ణుని ఆశ్రయించాను) అని, **"ఇని యఱిన్దేన్ ఈశఙ్కుమ్ నాన్ముకక్కుమ్ దెయ్‌వమ్"** (ఇక, పరమేశ్వరునకు, చతుర్ముఖునకు ప్రభువు నారాయణుడని గ్రహించాను) అని సకలప్రపంచకారణుడైన నారాయణుని పరతత్త్వాన్ని ప్రకటించి, చిరకాలం వేంచేసి ఉన్నారు.

ఈ విధంగా తిరుమళిశైప్పిరాన్‌వలె సారాసారవివేకాన్ని కల్గి, అసారమైన దానిని విడచిపెట్టానా? లేదుకదా ?'' అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"తిరుమళిశైయార్‌పోలే ఆరాయ్‌న్దువిట్టేనో!"** అని పల్కింది. ఇది తిరుమళి శైప్పిరాన్ చరిత్రలోని వృత్తాంతం.

**14. "అవన్ శిఱియనెన్డేనో, ఆళ్వారైప్పోలే"**

**"పువియుమ్, ఇరు విశుమ్బుమ్ నిన్నకత్త, నీ శెవియిన్ వళి పుకున్దు ఎన్నుళ్ళాయ్, ఆవి విన్ది యాన్ పెరియన్ నీ పెరియై ఎన్బదనై యారఱివార్? ఊన్ పరకు నేమియాయ్! ఉళ్ళు"** (భూలోకం, విశాలమైన పరమపదం నీలో ఉన్నాయి. అటువంటి నీవు నా చెవి ద్వారా ప్రవేశించి, నాలో ఉన్నావు. మఱి, నీవు పెద్దవాడవా? నేను పెద్దవాడనా? సుదర్శన చక్రధారీ! నీవే చెప్పు)



అని నమ్మాళ్వార్లు భగవంతుని ఉద్దేశించి - పెరియతివన్దాది ప్రబంధంలో అన్నారు. అందువల్లనే ఈప్రబంధానికి పెరియతిరువన్దాది అనే పేరు కల్గింది.

సర్వేశ్వరుని తమ మనస్సులో పెట్టుకొని ఆనందించి, ఈవిధంగా నమ్మాళ్వార్లు పల్కినట్లు, "నేను పెద్దవాడను, నీవు చిన్నవాడవు- అని నేను అన్నానా?'' అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"ఆళ్వారైప్పోలే అవన్ శిఱియన్ - ఎన్డేనో?"** అని అన్నది. ఇది దివ్యప్రబంధవృత్తాంతం.

**15. "ఏదేనుమ్ ఎన్డేనో, కులశేఖరనైప్పోలే"**

**"కొల్లి కావలన్, కూడల్ నాయకన్, కోళిక్కోన్ కులశేకరన్"** అని, **"రాజానం కులశేఖరమ్"** అని చక్రవర్తియై వెలిగిన కులశేఖరాళ్వార్లు తిరుమలను సేవించగోరి ఆ స్వామి పాదాలను ఆశ్రయించి, ఆనందనృత్య మాడగోరి **"కోనేరి వాళుమ్ కురుకాయ్ ప్పిఱప్పేనే"** (పుష్కరిణిలో నివసించే నీటికొంగగా పుట్టగలనా?) అని, **"మీనాయ్ ప్పిఱక్కుమ్ విది యుడైయే నావేనే"** (చేపగా జన్మించే అదృష్టాన్ని కలిగినవాడను కాగలనా?) అని, **"అన్ననైయ పొఱ్కువడామ్ అరున్దవత్త నావేనే"** (బంగారు శిఖరంగా కాగల్గిన తపస్సును కలవాడను కాగలనా?) అని, **"నెఱియాయ్ క్కిడక్కుమ్ నిలైయుడైయే నావేనే"** (మార్గంగా ఉండే స్థితిని పొందగలనా?) అని, **"కోనాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయనావేనే"** (అరణ్యంలో ప్రవహించే కొండవాగుగా కాగలనా?) అని, **"పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేన్"** (మందిరంలోని గడపగా పడి ఉండి నీ పడగపు మోవిని దర్శించ గలనా?) అని, **"ఎమ్బెరుమాన్ పొన్‌మలైమేల్ ఏదేను మావేనే"** (భగవంతుని కొండపై ఏదైనా కాగలనా?) అని ఆశపడ్డారు. తిరుమల అనే భగవంతుని బంగారు కొండతో సంబంధం కల తిర్యక్‌స్థావర జన్మలలో ఏది లభించినా చాలు - అని అభిలషించారు.

అనన్దాళ్వాన్ **"ఏదేను మావేనే"** అనే కులశేఖర సూక్తిని **"తిరువేఙ్గడ ముడైయాన్ తానాకవుమ్ అమైయుమ్" అదావదు- శేషభూతర్ తిరళుక్కు ప్పుఱమ్బాన శేషి యాకవుమ్ అమైయుమ్"**. "శ్రీవేంకటాద్రిపై నేను ఏమయినా కావాలి, అంటే- శేషభూతుల బృందంకంటే వేఱయిన శేషి వేంకటేశ్వరుడుగా

అయినా చాలు) అని వివరించారు. **"నానుమ్ అఱియవేణ్డా, తిరువేఙ్గడ ముడైయానుమ్, అఱియ వేణ్డా. తిరుమలైమేలే ఉళ్ళదొరు పదార్థమాక అమైయుమ్"** (నాకు తెలియనక్కరలేదు, శ్రీవేంకటేశ్వరునకు తెలియనక్కర లేదు. చూచినవారికి తెలిసి, ఆనందించనక్కర లేదు. ఏదోవిధంగా తిరుమలలో ఉండే ఒక పదార్థంగా అయితే చాలు) అని భట్టర్ వివరించారు.

ఈ విధంగా తిరుమలలో ఏదయినా కావాలి - అని పల్కిన కులశేఖరుల అభిప్రాయాన్ని నేను కల్గి ఉన్నానా? - లేదుకదా! - అనే భావంతో అని తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"కులశేఖరనైప్పోలే ఏదేనుమ్ ఎన్ఱేనో!"** అని పల్కింది. ఇది కులశేఖరచరిత్రలోని వృత్తాంతం.

## 16. "యాన్ సత్యమెన్ఱేనో, కృష్ణనైప్పోలే"

శ్రీకృష్ణుడు చేసిన మిత్రభేదంతో మొదట అశ్వత్థామకు సైన్యాధిపతిగా అధికారాన్ని ఇవ్వడానికి తిరస్కరించిన దుర్యోధనుడు, చివరలో అతనిని సేనాధిపతిగా చేశాడు. అశ్వత్థామ పాండవకులాన్ని సమూలనాశనం చేయగోరి ఉపపాండవులను చంపి, అభిమన్యువు భార్య ఉత్తర గర్భంలోని శిశువును కూడా చంపగోరి అపాండవాస్త్రాన్ని ప్రయోగించాడు.

ఆ విధంగా అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం కారణంగా ఉత్తరాగర్భంలోని శిశువు నల్లగా మాడిన కట్టెవలె జన్మించింది. ఆ శిశువును బతికించమని సుభద్ర మొదలైనవారు శ్రీకృష్ణుని వేడగా, "నిత్యబ్రహ్మచారిగా ఉండేవాడు ఆ నల్లని కట్టెను తాకినపుడే అది ప్రాణం పోసుకుంటుంది" అని శ్రీకృష్ణుడు అన్నాడు. ఎవరూ "నేను నిత్యబ్రహ్మచారిని" అని ముందుకు రాలేదు.

పదహాఱువేలమంది దేవేరులను కల శ్రీకృష్ణుడు **"యది మే బ్రహ్మచర్యం స్యాత్ సత్యం చ మయి తిష్ఠతి... తేన జీవతు బాలకః"** ప్రమాణం చేసి అని "నేను నిత్యబ్రహ్మచారిని" అని అంగీకరించి, ఆ కట్టెను తాకగా, అది ప్రాణాన్ని పొందింది. ఈ వృత్తాంతాన్ని పెరియాళ్వార్ తమ ప్రబంధం పెరియాళ్వార్ తిరుమొழிలో **"ఉత్తరైతన్ శిఱువనైయుమ్ ఉయ్యక్కొణ్డ ఉయిరాళన్"** (ఉత్తర శిశువును కూడా ఉజ్జీవింపజేసిన, ఆత్మలన్నిటికి నిర్వాహకుడు) అని అన్నారు.



శ్రీకృష్ణుని వలె "నేనే సత్యం" అని నిశ్చయించుకొని పలికే అవకాశం నాకు ఉన్నదా ?" అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"కృష్ణనైప్పోలే యాన్ సత్యమెన్ఱేనో?"** అని అన్నది. ఇది మహాభారతవృత్తాంతం.

## 17. "అడైయాళమ్ శొన్నేనో!, కబంధనైప్పోలే"

శ్రీరామలక్ష్మణులు సీతాదేవిని అడవిలో వెదకుతూ వెడుతూ ఉండగా, వారిద్దరు ఒక ఘోరరూపాన్ని కల రాక్షసుని చేతికి ఇద్దరు చిక్కుకొన్నారు. అతని పేరు కబంధుడు.

ఆ రాక్షసునకు తల లేదు. కాళ్ళుకూడా లేవు. అతనికి ఒక పెద్ద పొట్ట, చాలా పొడుగైన రెండు చేతులు మాత్రం ఉన్నాయి. అతడు అరణ్యంలో ఒకచోట కదలలేకుండా ఉంటూ తన రెండు చేతులను చాచి, వాటికి దొరికిన జంతువులను తన పొట్టలో వేసికొని, భక్షించి జీవించేవాడు. పొట్టలోనే అతనికి విశాలమైన నోరు ఉండేది. వక్షఃస్థలంలో ఒక కన్ను ఉన్నది. చూడడానికి చాలా భీకరమైన ఈ ఘోరరూపంతో ఉండే రాక్షసుని చేతికి దొరికిన రామలక్ష్మణు లిద్దరు ఒక క్షణకాలం విస్తుపోయారు. తరువాత శ్రీరాముడు, లక్ష్మణుని చూచి, "నీవు ఇతని ఒక చేతిని నఱికి వేయి, ఇంకొక చేతిని నేను నఱుకుతాను" అని అన్నాడు. ఆవిధంగానే ఇద్దఱు కబంధుని రెండు చేతులను ఖండించారు.

కబంధుని చేతులను రామలక్ష్మణులు ఖండించగానే అతనికి తన పూర్వజన్మ గుర్తుకు వచ్చింది. అతడు వారిని చూచి "నేను చేసిన ద్రోహకృత్యం వల్ల శాపాన్ని పొంది, ఈ రూపంతో పడి ఉన్నాను. మీరు శ్రీరామలక్ష్మణులని ఇపుడు నాకు తెలిసింది. మీరు నా శరీరాన్ని దగ్ధం చేయండి. నా శాపం తీరి, పూర్వరూపాన్ని పొందగలరు. ఇదే నాకు ఇంద్రుడు చెప్పిన శాపవిమోచనం" అని అన్నాడు.

అపుడు శ్రీరామలక్ష్మణులు కబంధుని దహించారు. అతడు తన పూర్వరూపంతో ఎదురుగా ప్రత్యక్షమై, "మీరు సీతను తప్పక చూడగలరు. పంపాతీరాన్ని చేరి అక్కడ ఋశ్యమూకపర్వతంపై నివసించే వానరప్రభువైన సుగ్రీవుని స్నేహాన్ని సంపాదిస్తే, మీకు కార్యసిద్ధి కల్గుతుంది" అని పల్కి విమానాన్ని ఎక్కి స్వర్గాన్ని చేరాడు. **"శ్రూయతాం రామ! వక్ష్యామి సుగ్రీవో**

నామ వానరః, భ్రాత్రా నిరస్త... స తే సహాయో మిత్రం చ సీతాయాః పరిమార్గణే, భవిష్యతి హి తే రామ మా చ శోకే మనః కృథాః" ఇత్యాది శ్రీరామాయణ శ్లోకాలు స్మరణీయాలు.

"ఈ విధంగా కబంధునివలె, దుఃఖాన్ని పొందినవారి మనస్సుకు ఆశ్వాసాన్ని కలుగజేసి, వారి దుఃఖాన్ని తీర్చే మార్గాన్ని నేను తెలిపానా ?" అనే భావంతో **"కబంధనైప్పోలే అడైయాళమ్ శొన్నేనో"** అని తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై పల్కింది. ఇది శ్రీరామాయణంలోని వృత్తాంతం.

## 18. "అంతరంగమ్ శొన్నేనో, త్రిజటైయైప్పోలే"

త్రిజట విభీషణుని కుమార్తె దయావిహీనులైన రాక్షసులు నివసించే లంకలో పుట్టినది. అయినా ఈమె చక్కని జ్ఞానాన్ని, శీలగుణాన్ని కల్గినది. మాంసాన్ని భక్షించి శరీరాన్ని పెంచుకొనే క్రూరరాక్షసులు నిండిన లంకా నగరంలో మాంసాహారాన్ని, మద్యపానాన్ని వదలిపెట్టిన చక్కని ప్రవర్తనను కల్గినది.

రావణుని ఆజ్ఞానుసారం పలువురు రాక్షసస్త్రీలు సీతను ఎన్నో విధాలుగా బాధపెట్టారు. ఇటువంటి బాధలతో హింసపడే సీతాదేవికి త్రిజట ప్రాణసఖిగా మెలిగింది. భర్తను విశ్లేషించి విరహార్తిని పొందే సీతాదేవిని తగిన మంచి మాటలతో ఓదార్చి, ఆమెకు ఊఅటను కల్గించింది. రాక్షసుల క్రౌర్యాన్ని తలచి, సీత విహ్వల అయినపుడు సాధువచనాలతో ఆమెను శాంతపరచి, ఆమె కన్నీటిని తుడిచింది. తాను కూడా ఆమె దుఃఖాన్ని చూచి కన్నీటిని విడచింది. సీతాదేవిని తన తల్లిగానే తలచి ప్రేమతో వర్తించింది. ఏ స్త్రీని అయినా రావణుడు బలాత్కరించినట్లయితే, అతని శిరస్సు భగ్నం కాగలదని పూర్వం బ్రహ్మ రావణుడు నీకు ఇచ్చిన శాపాన్ని త్రిజట సీతకు తెలిపి, ఆమె మనస్సులోని భయాన్ని తీర్చింది. ఈ శాపానికి భయపడినందువల్లనే ఆమెను రావణుడు తాకలేక, అశోకవనంలో బంధించాడని కూడా తెలియజేసింది.

రావణుడు ఒకసారి తన మాయతో ఒక రాక్షసుని జనకునిగా మార్చి, అతని బంధించి సీత సమక్షానికి తీసికొనివచ్చినపుడు, ఆమె చాలా దుః ఖించింది. అపుడు త్రిజట అది అంతా రావణుని మాయ - అని బాధపడవద్దని



ఓదార్చింది. బ్రహ్మాస్త్రంతో చైతన్యరహితుడై మూర్ఛిల్లిన లక్ష్మణుని, "లక్ష్మణుని కోల్పోయానే" అనే దుఃఖంతో మిక్కిలిగా మోహాన్ని పొందిన శ్రీరాముని సీతాదేవి యుద్ధభూమిలో చూచి దుఃఖించగా, "ఈ మూర్ఛనుండి త్వరలో లక్ష్మణుడు తేరుకొనగలడు. నీ నాథుడు కూడా నెమ్మదిని పొందగలడు. నీవు దుఃఖించకు" అని సీతాదేవిని ఓదార్చింది. ఈ సందర్భాలను అన్నిటినీ శ్రీరామాయణంలోని యుద్ధకాండలో గమనించవచ్చు.

"ఇతరులకు కల్గిన దుఃఖాన్ని తీర్చాలనే మంచి మనస్సును కల త్రిజటవలె నేను మనస్సు విప్పి ఎవరితోనైనా పలికానా?" అనే భావనతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"త్రిజటైయైప్పోలే అంతరంగమ్ శొన్నేనో"** అని పల్కింది. ఇది శ్రీరామాయణవృత్తాంతం.

## 19. "అవన్ దెయ్వమెన్టేనో మండోదరియైప్పోలే"

భర్తను దైవంగా తలచి వర్తించిన పతివ్రతలలో మండోదరి అగ్రగణ్యురాలు. విధివశంచేత విగతజీవుడైన తన భర్త మృతశరీరాన్ని యుద్ధభూమిలో చూచి, మండోదరి. **"మున్నేయో విழుస్దదువుమ్ ముడిత్తలైయో పడిత్తలైయ ముకమ్ కాట్టాయో? ఎన్నేయో ఎన్నేయో ఇరావణనార్ ముడిన్ద పరిశు ఇదువో పావమ్!"** అని అంటూ భర్తపట్ల తనకు గల ప్రేమను వ్యక్తం చేస్తూ పెద్దగా ఆక్రందించింది.

ఈ విధంగా భర్తపట్ల అంతు లేని అనురాగాన్ని కల్గిన మండోదరి, యుద్ధభూమిలో రావణుడు క్షతగాత్రుడై, విగతజీవుడై పడిన దృశ్యాన్ని చూచినందున కల్గిన దుఃఖాన్ని సహించలేక, తానుకూడా ప్రాణాలను త్యజించే సమయంలో శ్రీరాముడు ఆమె కంటికి కన్పించాడు. అతనిని చూడగానే నిజానికి మండోదరి, లోకరీతినిబట్టి, అతనిని తీవ్రంగా నిందించవలసి ఉన్నది. కాని, ఆమె జ్ఞానాధికురాలైనందున, తన ముందు నిలచిన శ్రీరాముడు సాక్షాత్తు క్షీరాబ్ధిలో శయనించిన పరమాత్మయే అని గ్రహించింది. **"ఆరా అముదాయ్ అలైకడలిల్ కణ్వళరుమ్ నారాయణన్ ఎన్ఱిరుప్పేన్ ఇరామనై నాన్"** (అపర్యాప్తామృత రూపుడై, అలలు లేచే క్షీరాబ్ధిలో శయనించే నారాయణుడే - అని శ్రీరాముని నేను భావిస్తాను) అని తలచి, అతనికి నమస్కరించి, ప్రాణాలు విడచింది. ఇది కంబరామాయణంలోని సూక్తి. వాల్మీకి

రామాయణంలో కూడా మండోదరి **"తమసః పరమో ధాతా శంఖ చక్రగదాధరః"** అని పల్కినట్లు తెలుపబడింది.

ఆ విధంగా మండోదరివలె నేను యథార్థజ్ఞానాన్ని పొంది పరమాత్మను యథాతథంగా తెలియగలిగానా? అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"మండోదరియైప్పోలే అవన్ దెయ్వమెన్ఱేనో!"** అని పల్కింది. ఇది శ్రీరామాయణవృత్తాంతం.

## 20. "అహం వేద్మి - ఎన్ఱేనో, విశ్వామిత్రనైప్పోలే"

విశ్వామిత్రమహర్షి దశరథుని వద్దకు వచ్చి తాను చేయ తలపెట్టి యాగాన్ని రక్షించడం కోసం శ్రీరాముని తనతో పంపమని కోరాడు. **"తిరువనత్తుళ్ యానియఱ్ఱుమ్ తకైవేళ్వి క్కిడైయూఱా త్తవమ్ శెయ్వోర్కళ్ వెరువర చ్చెన్ఱడై కామ వెకుళి యెన నిరుతరిడైక్కా వణ్ణమ్ శెరుముకత్తు క్కాత్తి యెన నిన్ శిఱువర్ నాల్వరిలుమ్ కరియ శెమ్మల్ ఒరువనై త్తన్దిడు ఎన ఉయిరిరఙ్గుమ్ కొడుమ్ కూఱ్ఱినుళ్ఱైయ చ్చెన్నాన్"** (నేను సిద్ధవనంలో చేసేయాగాన్ని రాక్షసులు అడ్డుకోకుండా, నీపుత్రులు నల్గురిలో నీలవర్ణుడైన శ్రీరాముని నాతో పంపించు) అని విశ్వామిత్రుడు అడిగాడు. అపుడు దశరథుడు **"ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః"** అని పదహారేండ్లు కూడా నిండని ప్రాయంవాడైన శ్రీరాముని నేను పంపించలేను. మహాత్మా! నేనే స్వయంగా వచ్చి, నీ యాగాన్ని రాక్షసులవల్ల ఏ ఆటంకం రాకుండా రక్షిస్తాను'' అని అన్నాడు.

వెంటనే విశ్వామిత్రుడు, "నేను నీ కుమారునకు ముల్లోకాలలోను కీర్తి కలిగేటట్లు చేయాలని వచ్చాను. అంతేకాక, నీవు భయపడే రీతిలో శ్రీరాముడు సామాన్యమానవుడు కాడు. ఇతడు చాలా గొప్పవాడు. దశరథమహారాజా! ఇతడు ఎవరో నాకు తెలుసు **"అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్"** - **"వేదాహ మేతం పురుషం మహాంతమ్"** అని వేదం పల్కిన రీతిలో నీ కుమారుడు మహాత్ముడని, నిజమైన పరాక్రమశీలి- అని నాకు తెలుసు. "నాకే కాదు, వశిష్ఠునకు, ఈ మహర్షులందఱికి తెలుసు సుమా!''- అని అన్నాడు.



ఈ రీతిలో విశ్వామిత్రునివలె శ్రీరాముని భగవంతుడని నేను అన్నానా! - అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"విశ్వామిత్రనైప్పోలే- అహమ్ వేద్మి- ఎన్ఱేనో!"** అని పల్కింది. ఇది శ్రీరామాయణ వృత్తాంతం.

## 21. "తేవు మఱ్ఱఱియేనో, మదురకవియార్పోలే"

మధురకవులు, నమ్మాళ్వార్ల శ్రీచరణాలను ఆశ్రయించి, వారు అనుగ్రహించిన నాల్గు ప్రబంధాలను వారివల్ల ఉపదేశంగా పొంది, వాటిని స్వరబద్ధం చేసి, దివ్యగానరీతిలో వానిని మధురంగా పారాయణం చేశారు.

భరతాళ్వాన్ను పరదైవంగా భావించి, వారికి **"శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః"** అనే రీతిలో అత్యంత పరతంత్రులై, భరతుని కైంకర్యమే పరమపురుషార్థంగా భావించి, శత్రుఘ్నాళ్వాన్ వర్తించారు. ఈవిధంగా శత్రుఘ్నునివలె భగవత్పారతంత్ర్యం కంటే, భాగవత పారతంత్ర్యం అత్యంతం అనుష్ఠేయమని తలచి మధురకవులు, తమ ఆచార్యులైన నమ్మాళ్వార్ను ఉద్దేశించి, **"కణ్ణినుణ్శిఱుత్తాంబు"** అనే చరమపర్వానిష్ఠాత్మకమైన దివ్యప్రబంధాన్ని పాడి, **"తేవు మఱ్ఱఱియేన్"** అని పల్కి, పరమపదాన్ని పొందారు.

"ఆచార్యుడే పరదైవం, అతనికంటే మించిన దైవం ఇంకొకటి లేదు''- అని **"ఆచార్యాదిహ దేవతాం సమధికా మన్యాం న మన్యామహే"** అనే రీతిలోని మహావిశ్వాసాన్ని మధురకవులవలె నేను కల్గి ఉన్నానా! లేదుకదా! - అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై- **"మధురకవియార్ప్పోలే తేవుమఱ్ఱఱియేనో!"** అని అన్నది. ఇది సాంప్రదాయికమైన, మధురకవి ఆళ్వార్లకు చెందిన వృత్తాంతం.

## 22. "దెయ్వత్తై ప్పెఱ్ఱేనో, దేవకియారైప్పోలే"

కంసుడు, తన సహోదరి అయిన దేవకీదేవి గర్భంలో పుట్టే ఎనిమిదవ పుత్రుని ద్వారా తనకు మరణం కల్గుతుందని ఆకాశవాణిద్వారా విన్నాడు. ఆమెను, ఆమెభర్తను వసుదేవుని బంధించి, చెరలో పెట్టాడు. వారికి జన్మించిన పుత్రులను వరుసగా వధించాడు. చివరగా, ఎనిమిదవసారి దేవకి గర్భంనుండి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే పుత్రుడుగా శ్రీకృష్ణనామంతో అవతరించాడు.

అతని రూపసౌందర్యాన్ని దర్శించిన దేవకి, వసుదేవుడు, "అయ్యో! ఈ శిశువును కూడా కంసుడు వధిస్తాడేమో!" అనే భీతిని పొందారు. "శంఖచక్రాలతో అవతరించిన సర్వేశ్వరుని పుత్రునిగా పొందిన దేవకి ఆస్థానే భయశంకతో (తగని భయంతో) "స్వామీ! కంసునివల్ల నీకు అపాయం కలుగకుండా ఈ దివ్యరూపాన్ని ఉపసంహరించుకో" అని వేడింది. **"జన్మ తే మయ్యసౌ పాపో మా విద్యాత్ మధుసూదన!, సముద్విజే భవద్ధేతోః కంసాదహ మధీరధీః, ఉపసంహర విశ్వాత్మాన్ అదోరూప మలౌకికమ్, శంఖచక్ర గదాపద్మశ్రియా జుష్టం చతుర్భుజమ్"** ఇత్యాది భాగవతశ్లోకాలు స్మరణీయాలు.

**"దెయ్‌వద్దేవకి"** అని కీర్తింపబడే దేవకి తన తపఃఫలంగా శ్రీకృష్ణుని పుత్రునిగా పొందింది. ఇటువంటి అరుదైన భక్తితో నేను అపూర్వమైన, సర్వేశ్వరుని పుత్రునిగా పొందే మనోరథాన్ని కల్గి, అది సఫలమయే అదృష్టాన్ని పొందానా?- అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"దేవకియారైప్పోలే దెయ్‌వత్తైప్పెఱ్ఱేనో!"** అని పల్కింది.

## 23. "ఆழி మழై" ఎన్టేనో, వశుదేవరైప్పోలే

పంచాయుధాలతో పాటుగా అవతరించిన శ్రీకృష్ణుని చూచిన, వసుదేవుడు భయంతో - "స్వామీ! నిన్ను వధించాలని కంసుడు ఎదురు చూస్తున్నాడు. అందువల్ల నీవెవరో అతనికి తెలియనట్లుగా దివ్యాయుధమైన సుదర్శనాన్ని నీవు ఉపసంహరించుకో" అని వేడాడు. భగవానుడు కూడా ఆ విధంగానే దివ్యాయుధాలను ఉపసంహరించుకొని, ఈ లోకంలోని శిశువువలె మాఱిపోయాడు. శ్రీకృష్ణుడు పుట్టినవెంటనే పితృవాక్య పరిపాలనను చేశాడు.

శ్రీకృష్ణుడు చతుర్భుజాలతో అవతరించినందున "ఇతడు సర్వేశ్వరుడు" అని తెలుస్తున్నా, అతనిపట్ల గల ప్రేమాంధ్యంచేత "ఈ తిరుమేనికి ఏమి కీడు మూడుతుందో!" అని వసుదేవుడు భయపడ్డాడు. సర్వశక్తి అయిన భగవంతునకు కూడా ఏమి ఆపద కల్గుతుందో!- అని భయపడే ఆ రీతిలోని గొప్ప భక్తి నాకున్నదా?- అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై- **"వశుదేవరైప్పోలే ఆழி మழై ఎన్టేనో!"** అని పల్కింది. **"జాతోసి దేవదేవేశ! శంఖచక్రగదాధర!, దివ్యరూపమిదం దేవ! ప్రసాదేనోప సంహర"** అనే విష్ణుపురాణ శ్లోకాలు భావ్యాలు.



## 24. "ఆయనై వళర్త్తేనో, యశోదయారైప్పోలే"

**"ఒరుత్తి మకనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్ ఒరుత్తి మకనాయ్ ఒళిత్తు వళర"** (అద్వితీయ అయిన దేవకికి పుత్రుడై పుట్టి, ఆరాత్రిలో అద్వితీయ భాగ్యాన్ని కల యశోదకు పుత్రుడై రహస్యంగా వర్ధిల్లగా) అని తిరుప్పావై ప్రబంధంలో ఆణ్డాళ్ పల్కింది.

శ్రీకృష్ణుడు దేవకీదేవి గర్భంలో పుట్టిన తరువాత తన తండ్రి అయిన వసుదేవుని చూచి, తనను తీసికొనిపోయి, రేపల్లెలోని నందగోపాలుని ఇంటిలో విడచి రమ్మని అన్నాడు. వసుదేవుడు ఆ విధంగానే శ్రీకృష్ణుని తీసికొనిపోయి, యమునాతీరంలోని రేపల్లెలో నందగోపాలుని గృహంలో, అతని భార్య యశోదాదేవి పక్కలో పరుండబెట్టి తిరిగి వచ్చాడు. నిద్రలో ఉండే యశోదకు ఈ విషయం తెలియదు. తాను కన్నబిడ్డగానే శ్రీకృష్ణుని తలచి, అతనిని అల్లారుముద్దుగా పెంచింది.

శ్రీకృష్ణుని వధించాలని కంసుని ప్రేరణతో వచ్చిన పలువురు అసురులు యత్నించారు. కాని, శ్రీకృష్ణుని యశోద కంటికి రెప్పవలె సదా రక్షించింది. ఈ ప్రయత్నంలో ఆమె పడిన మనోవ్యాకులం లోకంలోని ఏ తల్లి పడలేదు.

"ఈ విధంగా యశోదవలె నాకు అద్వితీయమైన వాత్సల్యం భగవద్విషయంలో ఉన్నదా!"- అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్పిళ్ళై **"యశోదైయారైప్పోలే ఆయనై వళర్త్తేనో!"** అని పల్కింది. ఇది శ్రీవిష్ణుపురాణ వృత్తాంతం.

## 25. "అనుయాత్తిరై శెయ్‌దేనో, అణిలజ్గళైప్పోలే"

శ్రీరామచంద్రుడు సీతాదేవిని తిరిగి పొందడం కోసం లంకకు వెళ్ళగోరి, సముద్రానికి వారధి కట్టాడు. వానరవీరులైన హనుమంతుడు, అంగదుడు, నలుడు, కుముదుడు, నీలుడు మొదలైనవారందరు పెద్ద పెద్ద కొండలను, బండరాళ్ళను తీసికొని వచ్చి, సముద్రం మధ్యంలో పడవేసి ఆ వారధి నిర్మాణాన్ని చేశారు. అపుడు వానరులు చేసే సేవను చూచిన ఒక ఉడత, వారంతా శ్రీరాముని విషయంగా చేసే కైంకర్యంలో తాను కూడా పాలు పంచుకోవాలని ఆశపడి, తాను చేయగల్గిన సేవను చేయాలని తలచింది. నీటిలో మునిగి, తడిసిన తన శరీరంతో ఇసుకలో పొర్లి, తరువాత వానర

వీరులు వారధి కట్టే చోటకు వెళ్ళి, అక్కడ మళ్ళీ పొర్లి, తన శరీరానికి అంటుకొన్న ఇసుకను విదల్చుకొనేది. ఈ విధంగా ఉడత వారధినిర్మాణంలో యథాశక్తి కైంకర్యం చేసింది.

దీనిని గమనించిన శ్రీరాముడు ఉడత భక్తికి చాలా ఆనందించి, దాని చేతిలోనికి తీసికొని వీపుపై తన చేతి మూడు వేళ్ళతో ప్రేమగా నిమిరాడు. అపుడు అతని చేతి వేళ్ళ గుర్తులు ఆ ఉడత వీపుపై ముద్రింపబడ్డాయి. ఈ నాటికీ ఉడతజాతి వీపుపై మూడు రేఖలు చిహ్నంగా కన్పిస్తాయి. ఒక ఉడత చేసిన కైంకర్యం ఫలంగా, ఉడత జాతికి అంతటికి ఆ అదృష్టం కలిగింది.

ఈ వృత్తాంతాన్ని తొణ్డరడిప్పొడియాళ్వార్లు తమ తిరుమాలై ప్రబంధంలో **"కురఙ్గుకళ్ మలైయై నూక్క క్కుళిత్తు త్తామ్ పురణ్డిట్టోడి త్తరఙ్గనీర్ అడైక్కలుఱ్ఱ శలమిలా అణిలుమ్ పోలేన్"** అని ప్రస్తావించారు.

మనం ఎంత తక్కువజాతివారం అయినా భగవద్విషయంలో ప్రీతిని కల్గి ఉండాలి. మన భక్తి కార్యకరం కాకపోయినా, స్వామిచే గొప్పగా స్వీకరింప బడుతుంది. దీనికి ఉడత ఉదాహరణం.

భగవానునిపట్ల ఇటువంటి ప్రేమను నేను కల్గి ఉన్నానా?- అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"అణిలఙ్గళైప్పోలే అనుయాత్తిరై శెయ్దేనో!"** అని అన్నది. ఇది ద్రావిడసారస్వతంలో కన్పించే దేశ్యమైన వృత్తాంతం.

**26. "ఆవల్ పొరియై యీన్దేనో కుచేలరైప్పోలే"**

శ్రీకృష్ణుడు, కుచేలుడు కలసి వారి చిన్నతనంలో సాందీపనిమునివద్ద ఒకే కాలంలో విద్యాభ్యాసాన్ని చేశారు. తరువాత శ్రీకృష్ణుడు ద్వారకానగరానికి ప్రభువయ్యాడు. దరిద్రుడైన కుచేలుడు సుశీల అనే వనితను వివాహమాడి ఆమెవల్ల 27మంది సంతానాన్ని పొంది, దారిద్ర్యంవల్ల చాలా కష్టపడ్డాడు. అపుడు కుచేలుని పత్ని సుశీల ఒకనాడు తన భర్తతో విద్యాభ్యాససమయంలో స్నేహితుడై మెలిగిన ద్వారకాధీశుడైన శ్రీకృష్ణునివద్దకు వెళ్ళి, తమ సంతానం ఆకలి బాధ తీరేటట్లుగా ధనసహాయాన్ని అర్థించమని అన్నది.

ఆమె మాటను కుచేలుడు అంగీకరించలేదు. ఆమెతో - "గర్భంలోని శిశువుకు, రాతిలోని కప్పకు, గుడ్డులోని జీవానికి కూడా ఆహారాన్ని ఇచ్చే



స్వామి నీ పిల్లలకు తిండిపెట్టడా? నన్ను శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళి ధనం కోసం అర్థించమంటావా? నీకిది నాయంగా తోస్తున్నదా?'' అని అన్నాడు.

కాని, ఆమె కుచేలుని విడవలేదు. "స్వామీ ! మీరు శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళి ఆ స్వామిని దర్శించిరండి చాలు''అని అన్నది. అపుడు కుచేలుడు "శ్రీకృష్ణుని నేనెపుడో చాలాకాలం క్రితం దర్శించాను. సరేలే ! ఈ నెపంతో అయినా మళ్ళీ ఒకసారి ఆ స్వామిని సేవించి వస్తాను'' అని ఆమె మాటకు అంగీకరించి, శ్రీకృష్ణనగరానికి ప్రయాణమయ్యాడు. అతనికి కానుకగా తన దగ్గర ఉండే అటుకులు మూటకట్టి తీసికొని ద్వారకను చేరాడు.

కుచేలుని చూడగానే శ్రీకృష్ణుడు "మిత్రమా! నీవిక్కడకు రావడానికి నేనెంతటి భాగ్యాన్ని చేసికొన్నానో? ఇంతదూరం నడచి వచ్చావా! నీ పాదాలు ఎంత శ్రమపడ్డాయో కదా!" అని అతని పాదాలను స్పృశించి ఒత్తాడు. కుచేలుడు తాను తెచ్చిన అటుకులను శ్రీకృష్ణునకు సమర్పించడానికి చాలా సంకోచపడ్డాడు. శ్రీకృష్ణుడతని మనస్సును గ్రహించి, వాటిని తానే తీసికొని, "ఆహా! ఎంత రుచి! విదురుని విందుకూడా ఇంత తీయగా లేదు సుమా!- అని ప్రీతితో భుజించాడు.

**"పురివదువుమ్ పుకై పూవే"** అనేరీతిలో భగవంతుడు సుఖారాధ్యుడు. ఆ స్వామిని ఆరాధించడానికి లభించినదానిని దేనిని అయినా సమర్పించాలని కుచేలునివలె నేను ప్రయత్నించానా లేదుకదా! - అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై-**"కుచేలరైప్పోలే అవల్పొరియై యీన్దేనో!"** అని అన్నది. ఇది శ్రీభాగవత వృత్తాంతం (ఉత్తరార్థం-81వ అధ్యాయం) **"ఇత్యుక్తోపి ద్విజ స్తస్మై వ్రీడితః పతయే శ్రియః, పృథుకప్రసృతిం రాజన్! న ప్రాయచ్ఛద వాఙ్ముఖః,.... స్వయం జహార కిమిదమితి పృథుకతండులాన్"** ఇత్యాది శ్రీభాగవత శ్లోకాలు స్మరణీయాలు.

**27. ఆయుధఙ్గళ్ ఈన్దేనో, అగత్తియరైప్పోలే**

అరణ్యవాస సమయంలో శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతాదేవి కలసి అగస్త్యుని ఆశ్రమానికి వచ్చారు. శ్రీరాముని రాకను ముందుగానే గ్రహించిన వాడైనందున, అగస్త్యుడు వారిని సత్కరించాడు. శ్రీరామునకు అస్త్రాలను, దివ్యాయుధాలను ఇచ్చి, గోదావరీ తీరంలో ఉండే పంచవటికి పోయి, అక్కడ నివసించమని తెలిపి, వారిని పంపించాడు.

దేవకార్యార్థం అవతరించిన శ్రీరాముని మనస్సును గ్రహించి, అగస్త్యుడు ఆయుధాలను శ్రీరామునకిచ్చాడు.

ఈ విధంగా, అగస్త్యునివలె లోకకల్యాణానికి అనుకూలమైన కార్యాన్ని చేయడం నాకు సాధ్యమైనదా?- అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"అగత్తియర్పోలే ఆయుధఙ్గళ్ ఈన్దేనో"** అని అన్నది. ఇది శ్రీరామాయణ వృత్తాంతం.

## 28. అన్తరఙ్గమ్ పుక్కేనో, సంజయనైప్పోలే

సంజయుడు ధృతరాష్ట్రుని అంతరంగస్నేహితుడు. భారతయుద్ధం జరగడానికి ముందు, దుర్యోధనుడు అతనిని పాండవుల దగ్గరకు దూతగా పంపించాడు. అంతేకాక, పాండవుల పట్ల సంజయుడు, సహజమైన ప్రీతిని కలవాడు. భారతయుద్ధసమయంలో, శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన గీతోపదేశాన్ని, యుద్ధంలోని సంఘటనలను ఎప్పటికప్పుడు నేరుగా జరుగు తున్నట్లుగా, వ్యాసభగవానుడు అనుగ్రహించిన తన జ్ఞాననేత్రంతో దర్శించి తన యజమాని అయిన ధృతరాష్ట్రునకు తెలిపాడు.

సంజయుడు తాను చేసేవి అన్నీ అంతరంగంతో -మనస్సుతో చేస్తాను- అని అన్నాడు. **"మాయాం న సేవే భద్రం తే న ఉధా ధర్మమాచరే, శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్దనమ్"** (భారత-ఉద్యో-58) అని అన్నాడు. ఇదేవిధంగా సంజయునివలె నేను చేసే కార్యాలను మనస్సులోని ప్రీతితో చేస్తున్నానా? లేదుకదా! అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"సంజయనైప్పోలే అంతరంగమ్ పుక్కేనో"** అని పల్కింది.

## 29. కర్మత్తాల్ పెఱ్ఱేనో, జనకరైప్పోలే

**"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"** అని జనకుడు కర్మ యోగంతో మోక్షాన్ని పొందినట్లు ప్రసిద్ధి. జనకుడు, కొందఱు ఋషిపుత్రులు కలసి యాజ్ఞవల్క్యమహర్షి వద్ద బ్రహ్మవిద్యను అభ్యసించారు, యాజ్ఞవల్క్యుడు జనకునిపట్ల ప్రత్యేకమైన అభిమానాన్ని కల్గి ఉండేవాడు. దీనివల్ల ఋషిపుత్రు లకు జనకుని పట్ల అసూయ కల్గింది. వారికి గుణపాఠం నేర్పడంకోసం



యాజ్ఞవల్క్యుడొక ఉపాయాన్ని ఆలోచించాడు. దగ్గరలో ఉండే ప్రదేశం, మిథిలానగరం అగ్నితోజ్వలిస్తున్నదని ఇద్దరు వీరులు పరుగెత్తి వచ్చి, పెద్దగా ఆక్రందించేటట్లు యాజ్ఞవల్క్యుడు ఏర్పాటు చేశాడు. వీరులు వచ్చి ఆవిధంగా చెప్పగా, ఋషిపుత్రులు అంతటా అగ్ని అంటుకొని జ్వలిస్తున్నట్లు భావించారు. వారు తమ కండలాలు, మౌంజి మొదలైనవి దగ్ధమవుతున్నాయేమో! అనే భయంతో పరుగులు తీశారు. జనకుడు మాత్రం తాను ఉండే చోటనుండి కదలలేదు. "నీవు కదలకుండా ఉన్నావే? ఏమి"అని యాజ్ఞవల్క్యుడు ప్రశ్నించగా, జనకుడు "స్వామీ! నాది అనేది ఏమి ఉన్నది! అంతా భగవంతునిదే కదా! **"మిథిలాయాం ప్రదీప్తాయాం న మే కించిత్ ప్రదహ్యతే"** అని బదులిచ్చాడు. ఇంతలోగా తిరిగి వచ్చిన ఋషిపుత్రులు వాస్తవాన్ని జనకుని వైరాగ్యాన్ని గ్రహించి, సిగ్గుపడ్డారు. జనకుని గొప్పతనాన్ని ఋషిపుత్రులకు తెలియడం కోసమే యాజ్ఞవల్క్యుడు ఈ రీతిలో చేశాడు.

తాను పొందిన జ్ఞానాన్ని అనుష్ఠించి చూపిన మహనీయుడు జనకుడు. ఈ విధంగా తన కర్మానుష్ఠానంతో వెలిగినవాడతడు. అందువల్లనే పరమపురుషార్థాన్ని పొందాడు. అంతేకాక, తన పుణ్యఫలంగా సీతను పొంది, శ్రీరామునకు కన్యాదానం చేసి, మామగారయ్యాడు.

ఇటువంటి రీతిలో జనకునివలె నేను మోక్షాన్ని కల్గించే కర్మానుష్ఠానాన్ని చేసిన దాననా?- అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై- **"జనకరైప్పోలే కర్మత్తాల్ పెఱ్ఱేనో"** అని పల్కింది.

## 30. కడిత్తు, అవనై క్కణ్డేనో? తిరుమఙ్గైయార్ పోలే

తిరుమంగైమన్నన్, తాను వివాహమాడదలచిన కుముదవల్లి తాయార్ మనోరథానికి అనుగుణంగా ప్రతిదినం వెయ్యి ఎనిమిదిమంది శ్రీవైష్ణవులకు తదీయారాధన చేసి, వారి శ్రీపాదతీర్థం, భుక్తశేషప్రసాదాలను స్వీకరిస్తానని ప్రతిజ్ఞచేసి, ఆమెను వివాహమాడారు. తాము చేసిన ప్రతిజ్ఞను అనుసరించి, ఆ రీతిలోనే కైంకర్యాన్ని ఏ కొఱతలేని రీతిలో నిర్వహిస్తూ ఉండగా, కొంతకాలానికి ఆళ్వార్ల వద్ద ఉండే ధనం అంతా భాగవతతదీయారాధన కోసం వ్యయమై పోయింది. కైంకర్యంలోని అభినివేశంచేత, ఆళ్వార్లు దారి దోపిడి చేసి అయినా,

ధనాన్ని సంపాదించి ఆ కైంకర్యాన్ని ఏ లోటు లేకుండా చేయాలి - అని తలచి రాత్రి సమయంలో బాటసారుల ధనాన్ని కొల్లగొట్టి, దానిని వ్యయం చేసి తదీయారాధన కైంకర్యాన్ని కొనసాగించారు.

ఈ విధంగా కొంత కాలం జరిగిన తరువాత, వయలాలిమణాళన్ తిరుమంగైమన్నన్‌ను విశేషంగా కటాక్షించాలని నిశ్చయించుకొని, పత్నీసహితుడై, బ్రాహ్మణవేషాన్ని ధరించి, పెళ్ళికొడుకు అలంకారంలో, అంతు లేని ధనంతో ఒక పెద్ద పరివారంతో కలసి ఒకనాటి రాత్రి తిరుమణమ్‌కొల్లై అనే చోటుకు వచ్చాడు. అక్కడా కాపు కాచుకొని ఉండే ఆళ్వార్లు గొప్ప సంతోషంతో ఆయుధధారియై స్వామిని సమీపించి, పెద్ద కోలాహలం చేస్తూ చుట్టుముట్టారు. వస్త్రాభరణాలను, ధనాన్ని అపహరించి, చివరిగా దివ్యపత్ని శ్రీపాదాలలో ఉండే ఉంగరాలను కూడా తీయాలని చూచారు. కాని, అవి ఊడి రాలేదు. పాదాలకు నమస్కరించేవారివలె వంగి నోటితో ఆమె ఆ పాదాలలోని అంగుళీయకాలను పంటితో కొఱికి తీశారు. అపుడు వలయాలిమణాళన్ వారిని చూచి **“నీర్ నమ్ కలియనో!”** (మీరు మా కలియన్ కదా!) అని అన్నాడు.

తరువాత ఆళ్వార్లు తాము కొల్లగొట్టిన వస్తువులను మూటకట్టుకొని పోవాలని చూచారు. కాని అంత బరువును మోయడం సాధ్యం కానందున, వయలాలిమణవాళన్ చూచి, “ఓ బ్రాహ్మణా! నీవిపుడు ఏదో మంత్రాన్ని ప్రయోగించినట్లున్నావు. అందువల్లనే నేనీ బరువును మోయలేక పోతున్నాను. నీవు ఆ మంత్రాన్ని నాకు తెలిపితే తప్ప, నా అధీనం నుండి నీవు బయటపడలేవు సుమా!” అని తన చేతి కత్తిని అటు ఇటు గిరిరా తిప్పుతూ తన బలిమిని చూపించారు. అపుడు వయలాలిమణాళన్ చాలా భయపడినట్లుగా అభినయిస్తూ, అతిశయించిన అందాన్ని కల తన అధరపుటాలను తెరచి “నేను ఆ మంత్రాన్ని మీకు తెల్పుతాను రండి” అని వారిని దగ్గరకు పిలచి, ప్రేమతో కౌగలించుకొని, “మంత్రాణాం పరమో మంత్రః” అని మంత్రాలన్నిటి లోకి ఉత్కృష్టమైన మంత్రమై, పరమగుహ్యమై, పవిత్రమై, శాశ్వతమైన మూలమంత్రమనే పేరును కల అష్టాక్షరీ మహామంత్రాన్ని, పూర్వం బదరికాశ్రమంలో నారాయణుడై అవతరించి ఉపదేశించమని అడిగేవారెవరూ లేనందున నరుడై, తనకు తానే ఉపదేశించిన లోటు తీరేటట్లు, ధనం



మూటకట్టిన వస్త్రంతోపాటు ఆ మూటలోని ధనాన్ని ఇచ్చేవారివలె, ఆళ్వార్ల కుడి చెవిలో **“కులమ్ తరుమ్... నారాయణా ఎన్నుమ్ నామమ్”** అని అతిశయమైన ఆనందంతో ఆళ్వార్ల తరువాత పలికే రీతిలో పురుకార స్వరూపిణి అయిన లక్ష్మీదేవికి, ప్రభువైన తనకు మధ్యలో నిలిపి **“పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు”** అనేటట్లు ఆచార్యుడై ఉపదేశించాడు.

ఈరీతిలో, లక్ష్మీదేవి శ్రీచరణాలలోని అంగుళీయాలను తీసికోవడం కోసం, ఆమె పాదాలను నోటి దంతాలతో తాకి, **“నాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్”** అని మంత్రాన్ని, మంత్రప్రతిపాద్యుడైన దేవత అయిన శ్రీమన్నారాయణుని తిరుమంగైమన్నన్ గ్రహించగలిగారు. వారివలె భగవంతుని అనుగ్రహానికి నేను పాత్రమయ్యానా! అనే భావంతో - **“తిరు మంగైయార్ పోలే కడిత్తు అవనై క్కణ్డేనో !”** అని తిరుక్కోళూర్ పెణ్‌పిళ్ళై పలికారు. ఇది తిరుమంగై ఆళ్వార్ చరిత్రలోని వృత్తాంతం.

## 31. కుడై ముదలానదు ఆనేనో ?, అనన్దాళ్వాన్ పోలే

**“శెన్‌ఱాల్ కుడైయామ్, ఇరున్దాల్ శిఙ్గాశనమామ్ నిన్‌ఱాల్ మరవడియామ్ నీళ్‌కడలుళ్ ఎన్‌ఱుమ్ పుణైయామ్ మణివిళక్కామ్ పూమ్ పట్టామ్ పుల్‌కు మణైయామ్ తిరుమాఱ్కు అరవు”** (భగవంతుడు సంచరించేటపుడు అతనికి గొడుగుగా, కూర్చున్నపుడు సింహాసనంగా, నిలిస్తే పాదుకలుగా, సముద్రంలో సదా శయనించే పడుకగా, మణిదీపంగా, పీతాంబరంగా, తలదిండుగా రూపాన్ని ధరించి ఆదిశేషుడు సేవచేస్తాడు) అనే రీతిలో వేయి పడగలను కల ఆదిశేషుడు భగవానునకు సర్వదేశసర్వకాల సర్వావస్థలలోను ఆ స్వామి మెచ్చిన కైంకర్యాన్ని చేస్తాడు.

“ఈ విధంగా ఆదిశేషుని వలె భగవంతుని కైంకర్యాన్ని నేను చేయగల్గు తున్నానా?” అనే భావంతో తిరుక్కోళూర్‌పెణ్‌పిళ్ళై **“అనన్దాళ్వాన్ పోలే కుడై ముదలానతు ఆనేనో”** అని పల్కింది. ఇది సాంప్రదాయికమైన అంశం.

## 32. కొణ్డు తిరిన్దేనో, తిరువడియైప్పోలే

ఎల్లప్పుడు భగవానుని మోసి, తీసికొనిపోతున్నందున గరుడునకు పెరియ తిరువడి అని, శ్రీరామావతారంలో మాత్రం శ్రీరాముని మోసినందున

హనుమంతునకు (శిఱియ) తిరువడి- అని శ్రీవైష్ణవ సాంప్రదాయిక వ్యవహారం. **"దాస స్సఖా వాహన మాసనం ధ్వజః యస్తే వితానం వ్యజనం త్రయీమయః, ఉపస్థితం తేన పురో గరుత్మతా"** అనే యామునులసూక్తి స్మరణీయం. **"దెయ్ వప్పుళ్ళేఱి వరువాన్ శిత్తిరకూడత్తుళ్ళానే"** అని, **"తామరైక్కణ్ణన్ ఎన్ నెఞ్జినుళ్ళే పుళ్ళై కడాకిన్ఱ వార్త్తై క్కాణీర్"** అని ఆఴ్వార్లు గరుడవాహనారూఢుడైన స్వామిని కీర్తించారు.

సుగ్రీవుని దగ్గర శ్రీరాముని తీసికొనిపోయేటపుడు హనుమంతుడు శ్రీరాముని తన భుజాలపై ఎక్కించుకొని పోయాడు. శ్రీరాముడు రావణునితో యుద్ధం చేసేటపుడు రావణుడు రథంపై ఉండి యుద్ధాన్ని చేశాడు. శ్రీరాముడు నేలపైననే నిలబడి అతనితో యుద్ధం చేయడం ఉచితం కాదు- అని తలచిన హనుమంతుడు శ్రీరాముని తన భుజాల పైకి ఎక్కించుకొని, యుద్ధరంగంలో సంచరించాడు. **"దాసోహం కోసలేంద్రస్య"** అని తనను రాముని దాసునిగా నిర్దేశించుకొన్నాడు.

ఈ విధంగా గరుడునివలె హనుమంతునివలె భగవంతునకు వాహనమై మోసే అదృష్టాన్ని పొందగలిగానా? లేదుకదా!'' అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"తిరువడియైప్పోలే కొణ్డు తిరిన్దేనో"** అని పల్కింది. ఇది సాంప్రదాయికమైన అంశం.

### 33. ఇళైప్పు విడాయ్ తీర్త్తేనో, నమ్బాడువాన్‌పోలే

పంచమవర్ణంలో జన్మించిన నమ్బాడువాన్ అనే భక్తుడు నిత్యం తిరుక్కుఱుఙ్గుడి అనే దివ్యక్షేత్రంలోని అర్చామూర్తి దగ్గరకు ప్రతిదినం పోయి, తీయని రాగంతో పాడి, ఆ స్వామికి సుప్రభాతాన్ని పలికేవాడు. ఒకనాడు ఆవిధంగా సుప్రభాతాన్ని గానం చేయడంకోసం కోవెలకు వెళ్ళే సమయంలో దారి మధ్యలో ఒక బ్రహ్మరాక్షసుడు అతనిని చూచి అడ్డుపడి భక్షించడానికి సిద్ధపడ్డాడు. అపుడు నమ్బాడువాన్ "నీవు నన్ను భుజిచడంకోసం శ్రమపడవద్దు. నేను సిద్ధంగా ఉన్నాను. అయితే, ఈనాడు ఏకాదశీతిథి. అందువల్ల కోవెలకు పోయి భగవానుని నా నోరార పాడి స్తుతించి, సుప్రభాతాన్ని పల్కి తిరిగివస్తాను అపుడు నన్ను తినవచ్చు''- అని అన్నాడు. బ్రహ్మరాక్షసుడు "నీవు రాకపోతే ఏంచేయాలి? నీ మాటను నేను ఏవిధంగా నమ్మడం?'' అని పల్కి నమ్బాడువాన్ మాటను అంగీకరించలేదు. అపుడు నమ్బాడువాన్ పలు ప్రమాణాలను చేసి, వాటిని ఆ బ్రహ్మరాక్షసుడు నమ్మేటట్లు చేసి, కోవెలకు వెళ్ళాడు. స్వామిని తన మధురమైన గానంతో స్తుతిస్తూ సుప్రభాతాన్ని పాడి, బ్రహ్మరక్షస్సు దగ్గరకు తిరిగి వచ్చాడు. వచ్చి, "ఇక నీవు నన్ను యథేష్టంగా భక్షించవచ్చు'' అని అన్నాడు.

ఈ బ్రహ్మరాక్షసుడు గతజన్మలో సోమశర్మ అనే బ్రాహ్మణుడు. అతడు యాగాన్ని చేసినపుడు, మంత్రలోపం, క్రియాలోపం- అనే వీనివల్ల దోషం ఏర్పడినందున, బ్రహ్మరాక్షసుని రూపాన్ని పొందాడు. పల్కిన మాట తప్పకుండా తన వద్దకు వచ్చిన నమ్బాడువాన్‌ను చూడగానే బ్రహ్మరాక్షసునకు జ్ఞానోదయమైనది. అపుడా రాక్షసుడు నమ్బాడువాన్‌తో "ఒకనాడు నీవు పాడిన పాటయొక్క పుణ్యఫలాన్ని నాకు ఇస్తే, నిన్ను విడచిపెడతాను'' అని అన్నాడు. అపుడు నమ్బాడువాన్ "నేను ఫలాన్ని కోరి పాడలేదు'' అని అన్నాడు. తరువాత బ్రహ్మరాక్షసుడు - "ఈనాడు నీవు కైశికరాగంలో పాడిన పాట ఫలాన్ని అయినా ఇవ్వు'' అని అన్నాడు. అతనిపైన జాలితో నమ్బాడువాన్ ఆమాటకు అంగీకరించాడు. దాని ఫలంగా బ్రహ్మరాక్షసుడు పాపవినిర్ముక్తుడై యాగఫలాన్ని పొంది, ముక్తిని పొందాడు.

ఆచార్యహృదయకారులు అఴకియమణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన ఆచార్యహృదయంలో **"విశ్వామిత్రర్, విష్ణుచిత్త, తులసీ పుత్రరోడే ఉట్కలన్దు తొఴుకులమానవన్"** అని విశ్వామిత్ర-విష్ణుచిత్త - తులసీపుత్రులనే ముగ్గురితో సమానంగా నమ్బాడువాన్‌ను పేర్కొన్నారు.

"తనను పీడించాలని వచ్చిన రాక్షసునకు కూడా తాను పొందబోయే ఫలాన్ని నమ్బాడువాన్ ఇచ్చాడు కదా! ఇటువంటి మంచి స్వభావాన్ని నేను కల్గి ఉన్నానా? లేదుకదా!'' - అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్‌ప్పెణ్పిళ్ళై **"నమ్బాడువాన్ పోలే ఇళైప్పువిడాయ్ తీర్‌న్దేనో!"** అని పల్కినది. ఇది వరాహపురాణగతమైన కైశికమాహాత్మ్య వృత్తాంతం.

**34. ఇడైకழிయే కణ్డేనో, ముదలాழ்వార్కళైప్పోలే**

పొయ్‌కై ఆழ்వార్లు, పూదత్తాழ்వార్లు, పేయాழ்వార్లు ముగ్గురు ఒక్కొక్కరు వేఱ్వేఱుచోట్ల అవతరించి దివ్యదేశసందర్శనాన్ని చేస్తూ, ఆ యా అర్చామూర్తులకు మంగళాశాసనం చేస్తూ సంచరించారు. వారు ముగ్గురు ఒకనాడు తిరుక్కోవలూర్ అనే దివ్యక్షేత్రంలో భగవత్సంకల్పవశంచేత కలసి కొన్నారు.

ఆనాడు రాత్రివేళ, బాగా వర్షం కురుస్తూ ఉండగా, పొయ్‌కై ఆழ்వార్లు తిరుక్కోవలూర్‌లోని మృకండుముని ఆశ్రమాన్ని చేరి, ఆ ఇంటి మధ్యభాగంలో శయనించారు. తరువాత కొంచెం సేపటికి పూదత్తాழ்వార్లు అక్కడికి వచ్చి, పొయ్‌కై ఆழ்వార్‌తో చేరారు. వారిద్దరు అక్కడ కూర్చుండగల్గిన చోటు మాత్రం ఉన్నందున, కూర్చొని భగవద్గుణానుభవాన్ని చేయసాగారు. మఱి కొంతసేపటికి పేయాழ்వార్లు కూడా అచటికి చేరారు. అక్కడ వారు ముగ్గురు నిలుచుని ఉండగల్గిన అవకాశం మాత్రమే అక్కడ ఉన్నది. కనుక, వారు ముగ్గురు నిలుచుని ఉండి భగవదనుభవాన్ని పరస్పర సంభాషణాల ద్వారా పొందుతూ ఆనందించ సాగారు.

ఆ సమయంలో త్రివిక్రమరూపి అయిన తిరుక్కోలూర్‌లోని స్వామి ఆ ముగ్గురి మధ్య పత్నీ సహితుడై ప్రవేశించి, వారికి అంతకు ముందు లేని సమ్మర్దాన్ని కల్గించాడు. "ఇంతకు ముందు లేని సమ్మర్దం (ఇరుకుగా ఉండడం) ఇపుడు కల్గుతున్నదేమి? ఇతరులెవరైనా మన మధ్యలో ప్రవేశించారా?" అనే సందేహం ముగ్గురు ఆழ்వార్లకు కల్గింది. అపుడు పొయ్‌కై ఆழ்వార్లు భూమిని ప్రమిదగా, సముద్రజలాన్ని నేయిగా చేసి, సూర్యుడనే దీపాన్ని వెల్గించారు. పూదత్తాழ்వార్లు భక్తి (ప్రేమ) అనే ప్రమిదలో, ఆర్తి అనే నేతిని పోసి, చింతను వత్తిగా చేసి, జ్ఞానదీపాన్ని వెల్గించారు. ఈ రెండు దీపాల వెలుగులో అంధకారం అనే అజ్ఞానం తొలగిపోయింది. జ్ఞానప్రకాశం కల్గింది. పేయాழ்వార్లు భగవానుని ఆప్రకాశం ద్వారా దర్శించి, ఆ విషయాన్ని **"తిరుక్కణ్డేన్ పొన్‌మేని కణ్డేన్"** ఇత్యాదిగా పలికారు. ఈ విధంగా ముదలాழ்వార్లు ముగ్గురు భగవత్స్వరూప గుణవిభూతి లీలలను దర్శించి ఆనందించి,



తత్పరీవాహరూపంగా వరుసగా ముదల్ తిరువన్దాది, ఇరణ్డామ్ తిరువన్దాది, మూన్ఱామ్ తిరువన్దాది - అనే నూఱు నూఱు పాశురాలను కల మూడు ప్రబంధాలను అనుగ్రహించారు.

ఈ విధంగా ముదలాழ்వార్లవలె భగవంతుని కటాక్షానికి పాత్రమై, ఆ స్వామి మధురమైన పాశురాలతో కీర్తించగలిగానా? లేదుకదా! అనే భావనతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"ముదలాழ்వార్కళైప్పోలే ఇడైకழிయే కణ్డేనో!"** అని పలికింది. ఇది ముదలాழ்వార్ల చరిత్రలోని వృత్తాంతం.

**35. ఇరు మన్నర్ పెற்றேనో, వాల్మీకరైప్పోలే**

శ్రీరాముడు లోకాపవాదానికి భయపడి, సీతాదేవిని అరణ్యంలో విడచి పెట్టి రమ్మని లక్ష్మణునితో పాటు సీతాదేవిని అరణ్యానికి పంపాడు. అప్పటికి సీతాదేవి ఆఱు మాసాల గర్భిణి. వాల్మీకి మహర్షి ఆమెను తన ఆశ్రమానికి తీసికొనిపోయి, అక్కడ ఆమెను రక్షించాడు. ఆ ముని ఆశ్రమంలో సీతాదేవి ఒక మగశిశువును ప్రసవించింది. వాల్మీకిముని కృపతో ఆ బిడ్డ దిన దిన ప్రవర్ధమానుడయే సమయంలో, ఒకనాడు సీతాదేవి ఆ బిడ్డను వాల్మీకి సంరక్షణలో పెట్టి, నీటిని తెచ్చుకోవడం కోసం నడుమున బిందెను మోస్తూ వెళ్ళడం తటస్థించింది. వాల్మీకి కళ్ళు మూసికొని ధ్యానంలో ఉండడం ఆమె స్మరించి, అరణ్యంలోని మృగాల వల్ల బిడ్డకు ఏమి ఆపద వస్తుందో? ఏమో? అని దారిలో భయపడి, తిరిగి వచ్చి, తన బిడ్డను ఎత్తుకొని వెళ్ళిపోయింది.

వాల్మీకిమహర్షి కొంత సేపటికి కళ్ళు తెరచి చూచి, తన సంరక్షణలో సీతాదేవి బిడ్డను పెట్టివెళ్ళిన విషయాన్ని స్మరించాడు. ఎక్కడ చూచినా ఆ బిడ్డ కన్పించలేదు. సీతాదేవి పాతివ్రత్యమహిమకు అతడు భయపడి, వెంటనే ఒక దర్భను తుంచి, దానికి ప్రాణంపోసి ఇంకొక బిడ్డను సృష్టించాడు. వాస్తవానికి, వాల్మీకి తన యోగబలంతో సీతాదేవి బిడ్డను తన వెంటతీసికొని వెళ్ళిందనే విషయాన్ని గ్రహించే అవకాశం ఉన్నా, బిడ్డ కనబడలేదనే తొందరలో, మిక్కిలి భయపడిన అతడు వెనువెంటనే ఏమీ ఆలోచించకుండా ఇంకొక బిడ్డను సృష్టించాడు.

కొంత సేపటికి సీతాదేవి నీటిని తీసికొని, బిడ్డతో పాటు తిరిగి వచ్చింది. ఈ విధంగా కుశలవుల జన్మ జరిగింది. మొదట జన్మించిన బిడ్డకు లవుడని, వాల్మీకి ద్వారా సృష్టింపబడిన శిశువుకు కుశుడని పేర్లు. వారికి వాల్మీకి అన్ని విద్యలను నేర్పించాడు. తాను రచించిన శ్రీరామాయణాన్ని కుశలవులకు ఉపదేశించి, వారిద్వారా లోకంలో ప్రచారం అయేటట్లుచేశాడు.

ఈరీతిలో రామాయణగాథను గానం చేసి, లోకాన్ని ఉజ్జీవింపజేసిన బిడ్డలను ఇద్దటిని వాల్మీకివలె పొందగలిగానా?- అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై "వాల్మీకరైప్పోలే ఇరుమన్నర్ పెఱ్ఱేనో?" అని పల్కింది. ఇది ఉత్తర రామాయణవృత్తాంతం.

## 36. "ఇరు మాలై యీన్దేనో, తొణ్డరడిప్పొడియార్పోలే"

చోళమండలంలో తిరుమణ్డఙ్గుడి అనే దివ్యదేశంలో అవతరించిన విప్రనారాయణులు అనే మహాభక్తులు ప్రతిదినం శ్రీరంగక్షేత్రంలోని శ్రీరంగనాథుని దివ్యాలయాన్ని చేరి, శ్రీరంగనాథుని పట్ల గొప్ప భక్తితో ఆ స్వామికి కైంకర్యం చేయాలని ఆశపడ్డారు.

ద్వాపరయుగంలో మాలాకారుడనే భక్తుడు శ్రీకృష్ణబలరాములకు పూమాలికలను సమర్పించగా, వారిద్దరు చాలా సంతోషించారు. శ్రీగజేంద్రాళ్వాన్ పూవును సమర్పించగా వరదుడు ఆనందించాడు. పెరియాళ్వార్లు శ్రీవిల్లి పుత్తూర్లోని వటపత్రశాయి స్వామికి పూలమాలికలను అర్పించే సేవచేశారు. పెరియాళ్వార్ల వలె తాము కూడా భగవంతునకు పూమాలికలను కట్టి సమర్పించే కైంకర్యం చేయాలని ఆశపడిన తొండరడిప్పొడి ఆళ్వార్లు ఒక నందనవనాన్ని నిర్మించి, ప్రతిదినం పలువిధాలైన పూమాలికలను, తులసీ మాలికలను కట్టి, శ్రీరంగనాథునకు సమర్పించి కళ్ళార దర్శించి ఆనందించారు.

ఈ విధంగా పుష్పమాలికా సమర్పణకైంకర్యాన్ని చేసే కాలంలో ఆళ్వార్లు దేవదేవి అనే కాంతకు వశులై కొంతకాలం గడిపినా, చివరకు శ్రీరంగనాథుని అనుగ్రహంతో ఆ ప్రకృతి మాయనుండి విడివడి, శ్రీరంగనాథుని తప్ప ఇంకొక అర్చామూర్తిని సైతం కీర్తించని పరమైకాంతులై, ఆ స్వామికే వాచిక కైంకర్యాన్ని చేస్తూ తిరుమాలై, తిరుప్పళ్ళిఎళుచ్చి- అనే రెండు దివ్యప్రబంధాలను



అనుగ్రహించారు. తమ చరమపర్వనిష్ఠకు అనుగుణంగా "తొణ్డరడిప్పొడి యాళ్వార్" అనే నిరూపకనామాన్ని కూడా పొందారు. ఈ ఆళ్వార్లు శ్రీరంగ నాథునకు పూమాలికను సమర్పించడమే కాక, ఏనాటికీ వాడని పాశుర మాలికారూపమైన దివ్యప్రబంధాలను కూడా సమర్పించారు.

ఈ విధంగానే నేనుకూడా భగవంతునకు పాశురమాలికను, పూలమాలికను సమర్పించగలిగానా ? అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై "తొణ్డరడిప్పొడియార్ పోలే ఇరుమాలై యీన్దేనో !" అని పల్కింది. ఇది తొండరడిప్పొడి ఆళ్వార్ల చరిత్రలోని వృత్తాంతం.

## 37. "అవనురైక్క ప్పెఱ్ఱేనో, తిరుక్కచ్చియార్పోలే"

శ్రీరామానుజులు, తమ మనస్సులో కల్గిన కొన్ని సందేహాలను తిరుక్కచ్చినంబి వద్ద ప్రస్తావించి, వరదరాజస్వామి వద్ద వానిని నివేదించి వానికి సమాధానాలను తెలిసికొని, చెప్పవలసినదిగా వారిని వేడారు. నంబి ఆ విధంగానే వరదరాజస్వామివద్ద రాత్రివేళ ఏకాంతసమయంలో నివేదించగా, అపుడు వరదరాజస్వామి (1) నేనే పరతత్త్వాన్ని, (2) భేదమే దర్శనం, (3) ప్రపత్తియే మోక్షోపాయం, (4) పెరియనంబిని ఆచార్యులుగా ఆశ్రయించాలి, (5) శరీరావసానంలో మోక్షం, (6) అంతిమస్మృతి అక్కరలేదు- అనే ఆఱు వార్తలను పలికాడు. వానిని నంబి శ్రీరామానుజులకు తెలియజేశారు. ఈ ఆఱు వార్తలే శ్రీరామానుజుల భవిష్యత్తుకు మార్గదర్శకా లయ్యాయి.

ఈవిధంగా వరదుడు పల్కగా నంబి విన్న రీతిలో, నేనుకూడా వినగలిగానా? - అనే అభిప్రాయంతో పెణ్పిళ్ళై ఈ వార్తను పల్కింది. ఇది, తిరుక్కచ్చినంబి, శ్రీరామానుజుల చరిత్రలకు చెందిన వృత్తాంతం.

## 38. అవన్మేని ఆనేనో, తిరుప్పాణరైప్పోలే

తిరుప్పాణ్ ఆళ్వార్లు ఉఱైయూర్లో ధాన్యపుకంకిలో (ధాన్యగుచ్ఛంలో) అవతరించారు. ఆ బిడ్డను పాణర్కులానికి చెందినవారు ఒకరు గమనించి పెంచారు. భగవంతుని నిర్హేతుక కృపతో లోకోద్ధరణకోసం అవతరించిన ఆ శిశువు సహజంగానే లౌకికబంధాలకు అతీతంగా వర్తిస్తూ భగవద్భక్తా

గ్రేసరులై దినదిన ప్రవర్ధమానులయ్యారు. తాము పెరిగిన కులం పేరు పాణ్‌కులం అయినందున ఆ కులం పేరుతోనే తిరుప్పాణ్ ఆళ్వార్లు - అనే పేరుతో పిలువబడ్డారు. ప్రతిదినం కావేరీనదీ తీరానికి ఆవలి వైపున ఉండి, శ్రీరంగంలోని శ్రీరంగనాథుని వీణను వాయిస్తూ గానం చేసే కైంకర్యాన్ని ఈ ఆళ్వార్లు చేసేవారు. తాము చాలా తక్కువ కులంలో పెరిగినందున అప్పటి సాంఘిక వర్ణవ్యవస్థనుబట్టి శ్రీరంగక్షేత్రంలోకి వెళ్ళడానికి వీరు ప్రయత్నించలేదు.

ఒకనాడు తిరుప్పాణ్ కావేరీనదీతీరంలో నిల్చుని వీణాగానంతో శ్రీరంగ నాథుని కీర్తిస్తూ ఉండగా, అక్కడకు లోకసారంగముని శ్రీరంగనాథుని దివ్యారాధనకోసం కావలసిన జలాన్ని తీసికొనిపోవాలని కావేరీనదికి వచ్చారు. వారు అక్కడ తిరుప్పాణ్‌ను చూచి దూరంగా తొలగి పొమ్మని గట్టిగా పలికారు. తిరుప్పాణ్ ఆ విధంగానే దూరంగా వెళ్ళిపోయారు. లోకసారంగముని జలాన్ని తీసికొని, శ్రీరంగనాథుని ఆలయానికి వెళ్ళారు. శ్రీరంగనాథుడు అర్చకముఖంగా "నా పరమభక్తుడైన తిరుప్పాణ్‌ను తక్కువగా భావించడం అపచారపడడం తగదు. వారిని నీ భుజాలపై ఎక్కించుకొని నా దగ్గరకు తీసికొని రా'' అని ఆదేశించాడు. లోకసారంగముని తిరుప్పాణ్ దగ్గరకు పోయి శ్రీరంగనాథుని ఆజ్ఞను తెలియజేశారు. మొదట తిరుప్పాణ్ తమ కులాన్ని భావించి సందేహించినా, శ్రీరంగనాథుని ఆజ్ఞను శిరసావహించి, లోకసారంగముని భుజాలపై అధిరోహించగా, ముని వారిని తీసికొని శ్రీరంగనాథుని సన్నిధికి తీసికొని బయలుదేరాడు. దారిలోనే మునివాహనులైన తిరుప్పాణ్ శ్రీరంగనాథుని దివ్యమంగళరూపాన్ని పాదాదికేశాంతంగా దర్శించి అనుభవించారు. ఆ అనుభవం లోపల ఇముడక వెలువడగా, అది అమలనాదిపిరాన్ ప్రబంధంగా వ్యక్తమయినది. ఆ ప్రబంధం చివరలో వారు **"అరఙ్గనై క్కణ్డ కణ్‌కళ్ మ*ఱ్ఱొ*న్ఱినై క్కాణావే"** అని అంటూ అనన్యమైన ప్రతిపత్తితో "శ్రీరంగనాథుని తప్ప ఇంకొక అర్చామూర్తిని సైతం నా కళ్ళు చూడవు'' - అని పలికి, శ్రీరంగనాథుని పాద పద్మాల చెంత చేరి అదృశ్యులయ్యారు.

ఈ రీతిలోనే తిరుప్పాణ్‌వలె నేను భగవత్పాదసన్నిధిని చేరాలని ఆశించానా?- అనే భావంతో తిరుక్కోళూర్‌పెణ్‌పిళ్ళై **"తిరుప్పాణరైప్పోలే అవన్‌మేని ఆనేనో"** అని పల్కింది. ఇది తిరుప్పాణ్ ఆళ్వార్ల చరిత్రలోని వృత్తాంతం.



## 39. "అనుప్పివైయు మెన్డేనో, వశిట్టరైప్పోలే"

విశ్వామిత్రమహర్షి తాను నిర్వహించబోయే యాగాన్ని రక్షించడం కోసం శ్రీరాముని తనతో పంపమని దశరథ చక్రవర్తి దగ్గరకు వచ్చి అర్థించాడు. దానికి దశరథుడు అంగీకరించలేదు. ఆ సమయంలో, భవిష్యద్ద్రష్ట అయిన వశిష్టుడు "విశ్వామిత్రునిద్వారా శ్రీరాముడు అస్త్రవిద్యను పొందగలడని, ఆ ముని సీతారాముల కల్యాణానికి కారణభూతుడు కాగలడని గ్రహించి, దశరథునితో "నీవు ఏ సందేహం లేకుండా శ్రీరాముని విశ్వామిత్రుని వెంట పంపించు'' అని అన్నాడు. వశిష్ఠుని మాటపై గల నమ్మకంతో దశరథుడు శ్రీరామలక్ష్మణులను ఇద్దఱిని విశ్వామిత్రుని వెంట పంపించాడు. వారిద్దరు ఆ ముని చేసే యాగాన్ని రక్షించారు.

**"ఇక్ష్వాకూణాం కులే జాతః సాక్షాద్ధర్మ ఇవాపరః, కృతాస్త్ర మకృతాస్త్రం వా నైనం శక్ష్యంతి రాక్షసాః, ఏవంవీర్యో మహాతేజాః విశ్వామిత్రో మహాయశాః, న రామగమనే రాజన్! సంశయం కర్తుమర్హసి"** అనే బాలకాండ (21వసర్గ)లోని శ్లోకాలు స్మరణీయాలు.

"శ్రీరామునకు మంచి జరుగుతుంది; విశ్వామిత్రునితో శ్రీరాముని మంచిమాటను పంపించు''- అని వశిష్ఠునివలె నేను కూడా పలికానా?''-అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్‌పిళ్ళై **"వశిట్టరైప్పోలే అనుప్పివైయుమ్ ఎన్డేనో!"** అని పల్కింది.

## 40. "అడి వాజ్గినేనో, కొంగుపిరాట్టియైప్పోలే"

భగవద్రామానుజులు ప్రతిదినం భిక్షకోసం ఏడు ఇళ్ళకు వేంచేసేవారు. ఆ సమయంలో మేల్‌నాడు ప్రాంతంలో వర్షాలు సరిగాకురిసేవి కావు. అందువల్ల అక్కడ క్షామం (కరువు) ఏర్పడింది. అపుడు అక్కడినుండి సుమతి అనే పేరు కల స్త్రీ తన భర్తతో పాటు శ్రీరగానికి వలస వచ్చింది. శ్రీరామానుజుల వైభవాన్ని గ్రహించింది. అకలంకనాట్టాళ్వాన్ వంటి ప్రభువులు, కూరేశులవంటి మహనీయులు అందఱు శ్రీరామానుజులను ఆశ్రయించి ఉజ్జీవించడం గమనించింది. తాను కూడా వారిని ఆశ్రయించి, వారి కృపకు పాత్రమైనది. తమ దేశంలో కరువు తీరిపరిస్థితి చక్కబడిన

తరువాత, శ్రీరామానుజుల అనుమతితో తమ దేశానికి ప్రయాణమైనది. అపుడు శ్రీరామానుజులను ప్రార్థించి ద్వయోపదేశాన్ని వారి పాదుకలను తిరువారాధనగా పొందింది. సుమతి ప్రార్థనపై శ్రీరామానుజులు (ఆమె కొంగుదేశం నుండి వచ్చినందున) ఆమెకు "కొంగుపిరాట్టి" అనే పేరును పెట్టారు.

తరువాత కొంత కాలానికి, చోళరాజు వల్ల కల్గిన ఉపద్రవం కారణంగా శ్రీరామానుజులు మేల్కోటప్రాంతానికి వెళ్ళేటపుడు, దారిలో కొంగుపిరాట్టి రామానుజులకు వారి శిష్యులకు అతిథి సత్కారాన్ని చేయగోరింది. తానుకూడా శ్రీరామానుజుల శ్రీచరణ సంబంధాన్ని కల్గినదనే విషయాన్ని తాను గతంలో పొందిన పాదుకలను చూపి నిరూపించి, వారికి అందటికి చక్కని సత్కారాన్ని అందించింది.

ఈవిధంగా కొంగుపిరాట్టివలె శ్రీరామానుజుల పాదుకలను పొందగలిగానా? లేదుకదా! - అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"కొఙ్గుప్పిరాట్టియైప్పోలే అడి వాఙ్గినేనో"** అని పల్కింది. ("అడి వాఙ్గుదల్"- అంటే- పాదుకలను పొందడం.) ఇది శ్రీరామానుజ చరిత్రలోని వృత్తాంతం.

## 41. మణ్పూవై యిట్టేనో, కురువనమ్బియైప్పోలే

కురువపురమ్ అనే ఊరిలో ఉండే ఒక కుమ్మరి ప్రతిదినం తాను కుండలను చేసే పనిని ఆరంభించడానికి ముందు తాను నిర్మించిన శ్రీవేంకటేశ్వరుని విగ్రహాన్ని ఆరంభించడం అలవాటు. ఆ విధంగా అతడు చేసే ఆరాధనలో మట్టితో పూలను చేసి స్వామిని అర్చించేవాడు. అతడు సమర్పించిన ఆ మట్టిపూలు తిరుమలలోని శ్రీవేంకటేశ్వరుని పాదాలలో సుగంధంతో పరిమళించేవి. ఆశ్చర్యాన్ని చూచిన అర్చకులు, దానిని ప్రభువు తొండమాన్ చక్రవర్తికి తెలిపారు. ప్రభువుకూడా నేరుగా వచ్చి చూచి, చాలా ఆశ్చర్యపడ్డాడు, దీనికి కారణమేమో అతనికి తెలియలేదు. అపుడు స్వామి, తన భక్తుని మహిమను వ్యక్తం చేయగోరి (అర్చకముఖంగా) భక్తుడు సమర్పించే మట్టి పూవే తనకు చాలా ఇష్టమైన, అదే సుగంధాన్ని వీచే పూవు అయినదని తెలిపాడు. తొండమాన్ ప్రభువు ఆ భక్తుని సాక్షాత్తు దర్శించాలని పోయి, కురువనమ్బిని చూచి, అతని భక్తికి మెచ్చి ప్రశంసించాడు.



ఈ విధంగా నేనుకూడా భక్తితో మట్టిపూలను శ్రీవేంకటేశ్వరునకు సమర్పించానా? - అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై - **"కురువనమ్బియైప్పోలే మణ్పూవై యిట్టేనో"** అని పల్కింది.

## 42. మూల మెన్ఱ*ழை*త్తేనో, గజరాజనైప్పోలే

**"పోరానై పొయ్కై వాయ్ కోట్పట్టు నిన్ఱలఱి, నీరార్ మలర్క్కమలమ్ కొణ్డు ఓర్ నెడుమ్ కైయాల్ "నారాయణా వో! మణివణ్ణా! నాకణైయాయ్! వారాయ్ ఎన్ ఆరిడరై నీక్కాయ్, ఎన వెకుణ్డు తీరాద శీ*ற்*ఱత్తాల్ శెన్ఱు ఇరణ్డు కూఱాక ఈరా అదనై యిడర్ కడిన్దాన్ ఎమ్బెరుమాన్"** అని శిఱియ తిరుమడల్ ప్రబంధంలో పల్కిన రీతిలో గజేంద్రాழ்వాన్ ఆర్తిని భగవంతుడు తీర్చిన వృత్తాంతం ఇందులో ప్రస్తుతం.

భగవంతుడైన శ్రీమన్నారాయణుని అర్చించాలని తామరపూవును కోయడం కోసం ఒక తటాకంలోకి దిగిన గజేంద్రుని కాలును ఒక మొసలి గట్టిగా పట్టుకొని నీటిలోకి లాగడం ఆరంభించింది. ఆ మొసలి నోటి నుండి బయటకు రాలేక, "ఆదిమూలమా? గజేంద్రుడు భగవంతుని రక్షించమని అర్థిస్తూ, ఆక్రందించాడు. అతని ఆర్తధ్వనిని విని జగత్కారణమైన శ్రీమన్నారాయణుడు అతనిని రక్షించడంకోసం పరుగెత్తి వస్తూ తన చేతిలోని చక్రాయుధాన్ని మొసలిపై ప్రయోగించి దాని కంఠాన్ని ఖండించాడు. చిరకాలం మొసలివల్ల క్లేశపడిన గజేంద్రుని పాదాన్ని ప్రేమతో నిమిరాడు.

**"ఓం నమో భగవతే తస్మై యత ఏతచ్చిదాత్మకమ్, పురుషాయాది బీజాయ పరేశాయాభిధీమహి, యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయమ్, యోస్మాత్ పరస్మాచ్చ పర స్తం ప్రపద్యే స్వయంభువమ్"** ఇత్యాది శ్రీభాగవతం 8వ స్కంధంలోని 4వ అధ్యాయంలోని శ్లోకాలు గమనార్హాలు.

ఆ మొసలి దేవలుడనే ఋషిశాపంవల్ల మొసలి రూపాన్ని పొందిన **"హూహూ"** అనే గంధర్వుడు. తన శాపం తీరగా, నిజరూపాన్ని పొంది, భగవంతుని స్తుతించి తన లోకాన్ని చేరాడు. గజేంద్రుడు తాను సమర్పించాలని కోసిన తామరపూవును భగవంతుని పాదాలలో సమర్పించి, మనస్సులోని ఆర్తిని పోగొట్టుకొన్నాడు.

"నేను సమర్పించదలచిన పూవును భగవంతుని శ్రీచరణాలలో సమర్పించలేకపోయానే !" అనే గజేంద్రుడు "ఆదిమూలమా!" అని ఆర్తితో పిలిచినట్లుగా నేనుకూడా ఆర్తితో పిలిచానా! - అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై "గజరాజనైప్పోలే మూలమెన్ఱ్ఱైత్తేనో" అని పల్కింది.

## 43. పూశ క్కొడుత్తేనో, కూనియైప్పోలే

ధనుర్యాగంకోసం కంసునిచే వంచనతో ఆహ్వానింపబడ్డ బలరామ కృష్ణులు మధురానగరికి వచ్చి, ఆ నగరవీథులలో సంచరించారు. అపుడు చందనకలశాన్ని చేతిలో ధరించి వచ్చే, కన్య పరువంలోని గూనిని చూచి "పిల్లా! నీవు ఎవరికోసం ఈ గంధాన్ని తీసికొనిపోతున్నావు?" అని ప్రశ్నించారు. కుబ్జ శ్రీకృష్ణుని నేత్రసౌందర్యాన్ని దర్శించి వ్యామోహాన్ని పొంది, "సుందరరూపా! నాపేరు నైకవక్ర. కంసుని కోసం చందనం మొదలైన మైపూతలను సిద్ధం చేసే పనిలో నేను నియమింపబడ్డానని తెలియదా?" అని అన్నది. శ్రీకృష్ణుడు "మా దేహాలకు తగిన ఒక చక్కని గంధాన్ని నీవు ఇవ్వాలి" అని ఆమెతో చెప్పగానే, ఆమె "ఆ విధంగానే స్వీకరించండి" అని ప్రేమతో చాలా ఉత్తమమైన చందనాన్ని ఆమె సమర్పించింది. ఆ గంధాన్ని వారిద్దరు తమ శరీరాలకు పూసికొన్నారు. శ్రీకృష్ణుడు తన చేతి మధ్యవేలు చూపుడు వేళ్ళ చివరి భాగంతో ఆమె ఉత్తరీయాన్ని గ్రహించి, తన శ్రీచరణాలతో ఆమె పాదాలను అదిమిపట్టి, ఆమెను పైకిలాగి గూని ఉన్న చోట నిమిరి, ఆమె రూపాన్ని సరిచేయగా, ఆమె అద్భుతసౌందర్యరాశిగా రూపొందింది. **"కాంతే! కస్మాన్న జానాసి కంసేన వినియోజితామ్, నైక వక్రేతి విఖ్యాతా మనులేపనకర్మణి ... సుగంధ మేతత్ రాజార్హం రుచిరం రుచిరాననే, ఆవయోః గాత్రసదృశం దీయతా మనులేపనే, శ్రుత్వైతదాహ కుబ్జాసా గృహ్యతామితి సాదరమ్, అనులేపనం చ ప్రదదౌ గాత్రయోగ్య మథోభయోః, తతస్తాం చుబుకే శౌరి రుల్లాసనవిధానకృత్, ఉత్పాట్య తోలయామాస ద్వ్యంగుళేనాగ్రపాణినా, చకర్ష పద్భ్యాం చ తదా ఋజుత్వం కేశవోనయత్, తత స్సా ఋజుతాం ప్రాప్తా యోషితా మభవద్వరా"** ఇత్యాది శ్రీవిష్ణుపురాణం (పంచమాంశం) 20వ అధ్యాయంలోని శ్లోకాలు స్మరణీయాలు.



కంసునివల్ల తనకు దండన కల్గుతుందనే విషయాన్ని సైతం మఱచి, కుబ్జ శ్రీకృష్ణునకు గంధాన్ని సమర్పించింది. శ్రీకృష్ణుని అనుగ్రహానికి పాత్రురాలయినది. ఈవిధంగా నేను చేశానా? అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై "కూనియైప్పోలే పూశై క్కొడుత్తేనో" అని పల్కింది. ఇది శ్రీవిష్ణుపురాణంలోని వృత్తాంతం.

## 44. పూవై క్కొడుత్తేనో, మాలాకారరైప్పోలే

వంచకుడైన కంసునిచే పంపబడిన అక్రూరునితోపాటు శ్రీకృష్ణుడు, బలరాముడు మధురానగరికి వెళ్ళారు. నగరం బయట చుట్టి వచ్చేటపుడు సుదాముడనే (పూమాలికలను కట్టి జీవించే వృత్తిన కలవాడు) తన ఇంటికి రమ్మని అంటూ అర్థించాడు. ఆ విధంగానే వారిద్దరు మాలాకారుని ఇంటికి వేంచేయగా, **"ప్రసాదపరమౌ నాథౌ మమ గేహ ముపాగతౌ, ధన్యోఽహ మర్చయిష్యామి... తతః ప్రహృష్టవదనః తయోః పుష్పాణి కామతః, చారూణ్యేతా ని చాన్యాని ప్రదదౌ స విలోభయన్"** అనే రీతిలో వారిని అర్చించి, చక్కని పూమాలెలను సమర్పించాడు. శ్రీకృష్ణుడు అతని భక్తికి మెచ్చి, అనుగ్రహించాడు. దారిలో ప్రయాణం చేసేవారు అనుకోకుండా గొప్ప నిధిని పొందినట్లుగా తన ఇంటికి వచ్చిన శ్రీకృష్ణుని స్వాగతించి మాలాకారుడు ధన్యుడయ్యాడు.

ఈవిధంగా మాలాకారునివలె భగవానుని రాకను స్వాగతించి పూమాలికలను అర్పించి, అర్చించి ధన్యతను పొందానా! అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై- **"మాలాకారరైప్పోలే పూవై క్కొడుత్తేనో!"** అని పల్కింది.

## 45. వైత్తవిడత్తిరున్దేనో, భరతనైప్పోలే

పితృవాక్యపరిపాలనను చేయదలచిన శ్రీరాముడు లక్ష్మణునితో పాటు, సీతాదేవితో పాటు అరణ్యానికి వెళ్ళాడు. దశరథచక్రవర్తి, శ్రీరాముని విశ్లేషాన్ని సహించలేక ప్రాణాలు విడచాడు. ఆ సమయంలో కేకయదేశంలో మేనమామ యుధాజిత్తు వద్ద ఉన్న భరతుడు అయోధ్యకు తిరిగి వచ్చి తండ్రికి చేయవలసిన చరమక్రియలను నిర్వహించాడు.

తరువాత భరతుడు శ్రీరాముని వద్దవెళ్ళి అయోధ్యకు తిరిగి రమ్మని ప్రార్థించాడు. కాని శ్రీరాముడు పితృవాక్యపరిపాలనలోని మహిమను, ఆవిధంగా పరిపాలించకపోతే కలిగే దోషాన్ని భరతునకు తెలిపి, అతని మాటను తిరస్కరించాడు. భరతుడు ప్రార్థించగా తన పాదుకలను అతనికి ఇచ్చాడు. "వీనిని నా ప్రతినిధిగా చేసికొని రాజ్యపరిపాలన సాగించు''- అని అన్నాడు. ఈ విషయాన్ని పెరియాఴ్వార్లు తమ ప్రబంధంలో- **"మరవడియై త్తమ్బిక్కు వాన్ పణైయుమ్ వైత్తు"** అని నోరారా స్తుతించారు.

భరతుడు ఆ పాదుకలను శిరస్సుపై ఆనందంగా ధరించి, "కృతార్థుడ నయ్యాను, ధన్యుడయ్యాను'' అని పల్కి, తన పరివారంతోపాటు అయోధ్యకు బయలుదేరి, శ్రీరాముడు లేని అయోధ్యకు వెళ్ళలేక, నందిగ్రామంలో ఆ పాదుకలను నిలిపాడు, వాటికి పట్టాభిషేకాన్ని చేసి, తాపసవేషాన్ని ధరించి, ఆ పాదుకలకు ప్రతినిధిగా తాను నిలచి రాజ్యపాలన సాగించాడు.

పధ్నాలుగేండ్లు గడచిన తరువాత శ్రీరాముని పట్టాభిషేకం జరిగినపుడు, భరతుడు శ్రీరాముని ఆజ్ఞానుసారం యువరాజపట్టాభిషేకాన్ని అంగీకరించాడు. ఈ విధంగా శ్రీరాముని ఆజ్ఞకు బద్ధుడై వర్తించి, తన భగవత్పారతంత్ర్యాన్ని చాటుకొన్నాడు.

శ్రీరామాయణం అయోధ్యాకాండలోని **"అధిరోహార్య పాదాభ్యాం పాదుకే హేమభూషితే, సోధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్య చ, ప్రాయచ్ఛత్ మహాతేజా భరతాయ మహాత్మనే... ఫలమూలాశన్ వీర భవేయం రఘునందన, తవాగమన మాకాంక్షన్ సన్ వై నగరాద్బహిః"** ఇత్యాది శ్లోకాలు **(112**వ సర్గ) స్మరణీయాలు.

దాసుడు చేయవలసినది - శేషి అయిన భగవంతునకు విధేయుడే వర్తించడం - అంటే - పరతంత్రుడై ఉండడం. దీనిని భరతుడు తానాచరించి చూపించాడు. ఈవిధంగా నేను కూడా వర్తించానా? - అనే అభిప్రాయంతో **"భరతనైప్పోలే వైత్తవిడత్తిరున్దేనో?"** అని తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై పల్కింది. ఇది శ్రీరామాయణవృత్తాంతం.



### 46. వఴి అడిమై శెయ్దేనో, లక్ష్మణనైప్పోలే

శ్రీరాముడు తన తండ్రి మాటను అనుసరించి వర్తిస్తూ అరణ్యానికి వెళ్ళేటపుడు, అతనిని విడచి క్షణంకూడా ఉండలేని లక్ష్మణుడు అతనిని అనుసరించి వెళ్ళాడు. **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** అని అంటూ **"ఒఴివిలా అడిమై"** అనే సర్వదేశ- సర్వకాల- సర్వావస్థోచితమైన సకలవిధ కైంకర్యాలను చేశాడు.

దాసుని కర్తవ్యం-ఏమంటే **"యస్యాస్మి న తమంతరేమి"** అనే రీతిలో భగవంతుని విడచి ఉండకుండా అనుసరించి, సకలవిధ శేషవృత్తులను చేయడం. దీనిని ఆచరించినవాడు లక్ష్మణుడు. ఈరీతిలో నేనుకూడా భగవంతుని అనుసరిస్తూ వెళ్లి దాసవృత్తిని చేశానా? - అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై- **"లక్ష్మణనైప్పోలే వఴి యడిమై శెయ్దేనో?"** అని పల్కింది.

### 47. అక్కరైక్కేవిట్టేనో, గుహప్పెరుమాళైప్పోలే

పితృవాక్యపరిపాలనార్థం శ్రీరాముడు పధ్నాలుగు సంవత్సరాలకాలం అరణ్యవాసాన్ని చేశాడు. అతడు వనానికి వెళ్ళినపుడు సీతాదేవి, లక్ష్మణుడు అతనిని అనుసరించారు. వారిని ముగ్గురిని రథంపై కూర్చుండబెట్టుకొని సుమంత్రుడు తీసికొనిపోయి గంగానదీ తీరంలో విడచిపెట్టాడు. గంగాతీరంలోని శృంగిబేరపురానికి నాయకుడైన గుహుడు, శ్రీరాముని రాకను విని, అతడు రాగానే ఆ స్వామిని దర్శించి, సగౌరవంగా స్వాగతించి నమస్కరించాడు. చక్కని పదార్థాలను తీసికొని వచ్చి సమర్పించి స్వీకరించమని శ్రీరాముని అర్థించాడు. వనవాససమయంలో ఎవరిదగ్గర నుండి ఏమీ గ్రహించనని అంటూ శ్రీరాముడు **"న హి వర్తే ప్రతిగ్రహే"** అని సున్నితంగా అతని ప్రార్థనను శ్రీరాముడు తిరస్కరించాడు. అతనిపట్ల అంతు లేని సౌశీల్య సౌహార్దాలను చూపించాడు. దీనిని తిరుమంగైమన్నన్ మన్నన్ **"ఏఴై ఏదలన్ కీఴ్ మకన్ ఎన్నాదు ఇరఙ్గి మామఴైమాన్ మడనోక్కి ఉన్ తోఴి ఉమ్బి ఎమ్బి ఎన్టరుళ్ శెయ్దు"** (జ్ఞానహీనుడు, దరిద్రుడు, తక్కువకులంవాడు- అని భావించకుండా దయచూపి) అని కీర్తించారు.

ఆనాటి రాత్రి గుహుడు గంగాతీరంలో సీతారాములకు అందమైన శయ్యను ఏర్పాటుచేసి, వారు శయనించగానే, ఆరాత్రి వేళ పూర్తిగా, లక్ష్మణుని కూడా సందేహించే రీతిలో ఆ దివ్యదంపతులకు ప్రదక్షిణం చేస్తూ కాపు కాశాడు.

ఈ రీతిలో గుహుని గొప్పతనాన్ని అఴకియమణవాళప్పెరుమాళ్ నాయనార్ ఆచార్యహృదయమనే దివ్యగ్రంథంలో- **"కీఴ్మకన్ తలై మకనుక్కు సమసఖావాయ్, తమ్బిక్కు మున్ పిఱన్దు వేఴుమ్, విల్లుమ్ కొణ్డు, పిన్ పిఱన్దారై శోధిత్తు ఏకకులమానవైయుమ్"** అని కీర్తించారు.

మఱునాడు గుహుడు సీతారామలక్ష్మణులను తన నావపై ఎక్కించుకొని, గంగానదీతీరం ఆవలి వైపుకు చేర్చాడు. **"అథారురోహ తేజస్వీ స్వయం లక్ష్మణపూర్వజః, తతో నిషాధాపతిర్గుహో జ్ఞాతీ నచోదయత్, రాఘవోపి మహాతేజాః నావ మారుహ్యా తాం తతః, అనుజ్ఞాయ సుమంత్రం చ సుబలం చైవ తం గుహమ్, ఆస్థాయ నావం రామస్తు చోదయా మాస నావికాన్"** ఇత్యాది అయోధ్యాకాండ (52వ సర్గ) శ్లోకాలు భావ్యాలు.

"ఈవిధంగా గుహునివలె భగవంతుడు మెచ్చే కైంకర్యాన్ని దేనిని అయినా చేశానా! లేదుకదా!- అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై- **"గుహప్పెరుమాళైప్పోలే అక్కరైక్కేవిట్టేనో !"** అని పల్కింది

## 48. అరక్కరుడన్ పొరున్దేనో, పెరియవుడైయారైప్పోలే

శ్రీరామలక్ష్మణులను మాయామృగంద్వారా సీతను విడచి దూరంగా వెళ్ళేటట్లు చేసి, రావణుడు కపటంతో ఆమెను అపహరించాడు. రథంలో సీతాదేవిని పెట్టుకొని ఆకాశమార్గంలో లంకవైపు ప్రయాణం చేసే సమయంలో, సీతాదేవి తనను రక్షించమని పెద్దగా ఆక్రందించింది. ఆమె ఆక్రందనలను విని, జటాయువు (పెరియతిరువుడైయార్) ఆకాశంలోకి ఎగిరి, రావణుని రథానికి అడ్డు తగిలాడు. తన రెక్కలతో, గోళ్ళతో, ముక్కుతో రావణుని గాయపరుస్తూ తీవ్రంగా ఎదుర్కొన్నాడు. అపుడు రావణుడు పూర్వం తనకు శంకరుడిచ్చిన గొప్ప ఖడ్గంతో జటాయువు రెక్కలను ఖండించగా, జటాయువు నేలవాలి, మూర్ఛపోయింది.



తరువాత రామలక్ష్మణులను సీత జాడలను తెలిసికోవడంకోసం అన్వేషించేటపుడు వారికి సీతను రావణుడు తీసికొనిపోయిన విషయాన్ని తెలిపి ప్రాణాన్ని విడచాడు. తమకోసం ప్రాణాలను కూడా లెక్కచేయకుండా పోరాడిన జటాయువును చాలా మెచ్చుకొని, అతనికి శ్రీరాముడు బ్రహ్మమేధ సంస్కారాలను నిర్వహించాడు. దీనిని ఆచార్యహృదయకారులు నాయనార్ **"నాల్వరిల్ ముఱ్పట్టవర్ శెయ్ద పుత్రకృత్యముమ్"** అని ప్రస్తుతించారు. **"నహి మే జీవమానస్య నయిష్యసి శుభా మిమామ్, సీతాం కమలపత్రాక్షీం ప్రదాస్యామి యావత్ప్రాణం విశాచర", "తద్బభూవాద్భుతం యుద్ధం గృధ్రరాక్షసయో స్తదా"** ఇత్యాది అరణ్యకాండ (51వ సర్గ) శ్లోకాలు భావ్యాలు.

ఈవిధంగా శ్రీరాముని కోసం జటాయువువలె ప్రాణాలను సైతం లెక్కచేయకుండా పోరాడే రీతిలోని కైంకర్యాన్ని ఏమయినా చేశానా? - అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై- **"పెరియవుడైయార్పోలే అరక్కనుడన్ పొరుదేనో?"** అని పల్కింది.

(శ్రీరాముని తండ్రి అయిన దశరథునకు జటాయువు స్నేహితుడు. వయస్సులో పెద్ద కనుక, సంప్రదాయంలో జటాయువునకు **"పెరియ వుడైయార్"** (పెద్దతండ్రి-స్వామి) అనే వ్యవహారం ఏర్పడింది.)

## 49. ఇక్కరైక్కే శెన్టేనో, విభీషణరైప్పోలే

లంకలోని రావణుడు సభ చేసి "ఒక వానరం లంకలో ప్రవేశించి, నాశనం చేసిపోయింది. ఇపుడు మనం చేయవలసిన కర్తవ్యమేమి?'' అని అందఱిని అడిగాడు. అపుడతని మంత్రులు, ఇంద్రజిత్తు మొదలైన కుమారులు మొదలైనవారు అతని మనస్సుకు ప్రియంగా పలికారు.

**"విభీషణస్తు ధర్మాత్మా"** అనే రీతిలో ధర్మాత్ముడైన విభీషణాఴ్వాన్ మాత్రం జానకిని శ్రీరామునకు తిరిగి ఇచ్చివేయడమే కర్తవ్యమని అన్నాడు. రావణుడతని మాటలను అంగీకరించలేదు, సరికదా, అతనిపై చాలా కోపించి **"త్వాం తు ధిక్! కులపాంసనమ్"** అని ధిక్కరించి లంకనుండి బహిష్కరించాడు. అపుడు విభీషణుడు "ఇక ఈ పాపిష్ఠివానితో కలసి ఉండడం తగదు. శ్రీరామచంద్రుని ఆశ్రయించి ఉజ్జీవించడమే తగినవని'' తలచాడు. తన

నల్గురు మంత్రులతో కలసి, గదాపాణియై, ఆకాశంలోకి ఎగిరి ప్రయాణం చేసి, సముద్రానికి ఆవలి తీరంలో శ్రీరాముడు వేంచేసి ఉన్న చోటుకు వచ్చి ఆకాశంలోనే నిలచాడు. తన రాకను గూర్చి తెలియజేసి, తానతనిని ఆశ్రయించ గోరి వచ్చానని తెలుపమని సుగ్రీవాదులను విభీషణుడు కోరాడు. **"అక్కరై ఎన్నుమనత్తక్కడలుళ్ అழுన్దియున్ పేరరుళాల్, ఇక్కరై ఏఱి ఇళైత్తిరున్దేనై అఞ్జేల్ ఎన్ఱు కైకవియాయ్"** అని పెరియాழ்వార్లు ఈ సందర్భాన్ని ప్రస్తావించారు. **"స విభీషణః, ఉత్తరం తీరమాసాద్య ఖస్థ ఏవ వ్యతిష్ఠత, ఉవాచ చ మహాప్రాజ్ఞః.. సోహం పరుషిత స్తేన దాసవచ్చావమానితః, త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః"** ఇత్యాది యుద్ధకాండ శ్లోకాలు భావ్యాలు (17వ సర్గ).

ఈవిధంగా లౌకికవిషయ సంగాన్ని పూర్తిగా విడచి, భగవానుని శరణు వేడే స్థితిని విభీషణుని వలె, నేను పొందానా? - అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్‌పెణ్పిళ్ళై **"విభీషణరైప్పోలే ఇక్కరైక్కే శెన్ఱేనో?"** అని పల్కింది.

## 50. ఇనియదెన్ఱు వైత్తేనో, శబరియైప్పోలే

ఋశ్యమూక పర్వతంపై మంతగముని ఆశ్రమంలో నివసిస్తూ ఆ మునికి సలకవిధ సపర్యలను చేసే కోయవనిత శబరి. శ్రీరామలక్ష్మణులు ఆ ఆశ్రమానికి రాగలరని ముందుగా మతంగమునివల్ల ఆమె తెలిసికొన్నది. వారికి నివేదించడంకోసం అరణ్యంలో ఉండే తీయని ఫలాలను, వాటి రుచిని గమనించి, సేకరించింది. వారిరువురు ఆశ్రమానికి వచ్చినపుడు వాటిని నివేదించింది.

శ్రీరాముడు ఆమె అర్పించిన ఫలాలను చాలా ఆదరంగా భుజించాడు. ఆమెను అనుగ్రహించాడు. వాల్మీకి ఈ సంగతిని **"శబర్యా పూజితః సమ్యక్"** అని పలికారు. ఈ విషయాన్ని కూడా ఆచార్యహృదయంలో తత్కర్త నాయనార్ **"మూన్ఱు భోజనజ్గళిల్ ఒన్ఱాన సమ్యక్‌భోజనముమ్"** అని సూత్రీకరిస్తూ తెలిపారు. "ఎంతయని వర్ణింతును శబరి భాగ్యము" అని శబరివిందును త్యాగరాజు ప్రశంసించారు.

భగవంతునిపట్ల నిరతిశయమైన ప్రేమను కలవారు తాము మిక్కిలి అభిలషించే వస్తువులను భగవంతునకు అర్పించడం సహజం. **"కారియమ్**



**నల్లనవై కాణిల్ కణ్ణనుక్కేన్ఱు ఈఱియాయిరుప్పాళ్"** అని నమ్మాழ்వార్ల సూక్తి. దీనిని అనుష్ఠించి చూపించినవారు శబరి. ఆవిధంగానే నేను అనుష్ఠించానా?- అనే భావంతో **"శబరియైప్పోలే ఇనియదొన్ఱు వైత్తేనో"** అని తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై పల్కింది. ఇది శ్రీరామాయణ వృత్తాంతం.

## 51. ఇజ్గుముణ్డెన్ఱేనో, ప్రహ్లాదనైపోలే

హిరణ్యకశిపునకు కుమారుడై పుట్టిన ప్రహ్లాదుడు, తల్లి గర్భంలో ఉన్నపుడే, నారదమహర్షి ద్వారా శ్రీమన్నారాయణమంత్రాన్ని పొందాడు. జన్మించిన తరువాత శ్రీహరిని పరదైవంగా ఆరాధించాడు.

ముల్లోకాలకు నేనే అధిపతిని - అనే గర్వంతో, దేతలను అందఱిని భయపెట్టిన హిరణ్యుడు తన కుమారునకు అక్షరాభ్యాసం చేయడంకోసం కులగురువైన శుక్రాచార్యునివద్దకు పంపించాడు. శుక్రాచార్యుడు ప్రహ్లాదునకు **"హిరణ్యాయ నమః"** అనే మంత్రంతో అక్షరాభ్యాసాన్ని ఆరంభించాడు. కాని, ప్రహ్లాదుడు **"హరయే నమః"** అని ఆరంభించాడు. హరియే లోకానికి అంతటికి మూలభూతుడు, రక్షకుడు - అని గురువైన శుక్రునకే బోధించడం మొదలుపెట్టాడు. దీనిని తెలిసిన హిరణ్యుడు ప్రహ్లాదునిపై చాలా కోపించి, ప్రహ్లాదుని అనేకవిధాలుగా ఉపదేశాలతో మార్చడానికి యత్నించాడు. కాని, ఫలితం లేకపోయింది. అపుడు బాలుడు ప్రహ్లాదుని చూచి, "నీవున్నాడని పలికే హరి ఎక్కడ ఉన్నాడురా?" అని అడిగాడు. ప్రహ్లాదుడు వెంటనే "అంతటా హరి ఉన్నాడు తండ్రీ!" అని బదులిచ్చాడు. హిరణ్యకశిపుడు తనకెదురుగా ఉండే ఒక స్తంభాన్ని చూపించి, "నీవు చెప్పే హరి ఇందులో ఉన్నాడా?" అన్నాడు. ఆహా ! ఉన్నాడని ప్రహ్లాదుడన్నాడు. అపుడు హిరణ్యుడు తన చేతిగదతో ఆ స్తంభాన్ని గట్టిగా మోదాడు. భగవంతుడు, తన భక్తుడైన ప్రహ్లాదుని వచనాన్ని **"సత్యం విధాతుం నిజభృత్యభాషితమ్"** అనే విధంగా నిజం చేస్తూ నృసింహరూపంతో ఆ స్తంభం నుండి ఆవిర్భవించి, హిరణ్యకశిపుని వధించాడు. ఈ అద్భుతసన్నివేశాన్ని పెరియాழ்వార్లు **"ఆళన్దిట్టతూణై అవన్ తట్ట ఆజ్గే వళర్‌న్దిట్టు వాళుకిర్ చ్చిజ్గమాయ్ ఉళన్దాట్టు ఇరణియన్ ఒణ్ మార్వకలమ్ పిళన్దిట్ట కైకళ్"** అని కీర్తించారు. ఇదేవిధంగా పలువురి ఆழ்వార్ల శ్రీసూక్తులలో ఈ ఘట్టం రసఘనంగా ప్రస్తావింపబడింది.

"త్వయస్తి భగవాన్ విష్ణుః మయి చాన్యత్రా చాస్తి నః, యత స్తతోయం మిత్రం మే శత్రుశ్చేతి పృథక్మతః" అనే విష్ణుపురాణ (ప్రథమాంశ) 19వ అధ్యాయసూక్తి స్మరణీయం.

''నారాయణుడు అంతటా ఉన్నాడు'' అనే యథార్థాన్ని ప్రహ్లాదుని వలె నేనుకూడా ధైర్యంగా పలికానా? అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై - "ప్రహ్లాదనైప్పోలే ఇఝ్గుముణ్డేన్లేనో" అని పల్కింది.

**52. ఇఝ్గిల్లై ఎన్ఱేనో, దధిభాండనైప్పోలే**

దధిభాండుడు పెరుగును అమ్ముకొని జీవించేవాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు, యశోద తనకు స్తన్యాన్ని ఇవ్వలేదనే కోపంతో పెరుగుకుండలను బద్దలు కొట్టాడు. దానిని చూచి, అతనిని దండించాలని బెత్తం తీసికొని యశోద వచ్చింది. ఆమెకు దొరకకుండా ఉండడంకోసం శ్రీకృష్ణుడు దధిభాండుని ఇంటిలోకి దూరాడు. తనను రిక్తంగా (ఖాళీగా) ఉండే భాండంలో దాచి ఉంచి, యశోదకు కనపడకుండా రక్షించమని అతనిని శ్రీకృష్ణుడు వేడాడు. దధిభాండుడు కూడా ఒక కుండలో చిన్నికృష్ణుని దాచిపెట్టాడు.

ఇంతలో యశోద శ్రీకృష్ణుని వెదకుతూ అక్కడకు వచ్చి, దధిభాండుని చూచి ''ఇక్కడ శ్రీకృష్ణుడు ఉన్నాడా?'' అని అడిగింది. ''శ్రీకృష్ణుడు ఇక్కడలేడు'' అని దధిభాండుడన్నాడు. యశోద ఇంటికి తిరిగివెళ్ళిపోయింది. తరువాత శ్రీకృష్ణుడు దధిభాండునితో తనను కుండనుండి బయటకు తీయమన్నాడు. "నీవు సర్వేశ్వరుడవని నాకు తెలుసు. నీవు నాకు, నా పెరుగుకుండలకు పరమపదం ఇస్తే తప్ప నిన్ను బయటకు తీయ''నని అన్నాడు. శ్రీకృష్ణుడు తానక్కడకు రావడం అతనిని అనుగ్రహించడం కోసమే కనుక, అతని కోరికను అంగీకరించి, ఆ విధంగానే దధిభాండునకు, అతని కుండకేకాక, అతనికి చెందినవారికి కూడా మోక్షప్రదానాన్ని చేశాడు. ఈ కథ ఆచార్యహృదయం - 228వ సూత్రవ్యాఖ్యలో ప్రస్తావింపబడింది.

"దధిభాండునివలె భగవానుని పట్ల ప్రేమ, విశ్వాసం నాకు ఉన్నాయా? లేవే!''- అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై "దధిభాండనైప్పోలే ఇఝ్గిల్లై ఎన్ఱేనో!" అని పల్కింది.



**53. కాట్టుక్కు ప్పోనేనో, పెరుమాళైప్పోలే**

దశరథచక్రవర్తి శ్రీరామునకు మఱునాడు పట్టాభిషేకం చేయాలని నిర్ణయించి, ఆ వార్తను ప్రకటించి వెల్లడించాడు. సంతోషకరమైన ఆ వార్తను విని ఆయోధ్యానగర వాసులంతా సంతోషించారు. దశరథుడావార్తను తన చిన్నభార్య కైకేయికితో చెప్పాలని ఆమె అంతఃపురానికి వెళ్ళాడు. అప్పటికే ఈ విషయాన్ని మంథర కైకేయికి తెలిపి, ఆమెకు దుర్బోధ చేసినందున కైకేయి మనస్సు కలుషితమైనది. శ్రీరామునకు పధ్నాలుగేండ్లు వనవాసం, భరతునకు రాజ్యపట్టాభిషేకం- అనే రెండు వరాలను (అంతకుముందు ఎపుడో తనకిస్తానని మాట ఇచ్చిన వరాల రూపంగా) కైకేయి దశరథుని ఇమ్మని నిర్బంధించి అడిగింది. ఇచ్చిన మాటను కాదంటే దోషం వస్తుందనే భయంతో ఆమె అడిగిన వరాలను దశరథుడు కాదనలేకపోయాడు. పితృవాక్యపరిపాలనాపరాయణుడైన శ్రీరాముడు కైకేయి వరాలకు తగినట్లు వనవాసానికి వెళ్ళిపోయాడు. "కూనురువిన్ కొడుమ్ తొழுత్తై శొఱ్కేట్ట కొడియవళ్ కైకేయి కలక్కియ మామనత్తనళాయ్ మన్నవనై వరమ్ వేణ్డ, మలక్కియ మామనత్తనాయ్ మన్నవనుమ్ మాఱాదొழியు, కులక్కుమరా! కాడుఱైయ ప్పో "ఎన్ఱు విడై కొడుప్ప" అని ఆழ்வార్లు దీనిని ప్రస్తావించారు. శ్రీరాముడు మాత్రం వనవాసాన్ని గూర్చి ఏమీ సంశయించకుండా "రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః" అని వనవాసాన్ని గొప్పగా భావించి అరణ్యాలకు వెళ్ళిపోయాడు.

తనను ఆశ్రయించినవారి (ఇంద్రాది) క్లేశాలను తీర్చడంకోసం వనానికి వెళ్ళిన శ్రీరామునివలె లోకకల్యాణం కోసం నేను ఏమయినా చేశానా? అనే భావంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై - "పెరుమాళైప్పోలే కాట్టుక్కు ప్పోనేనో ?" అని పల్కింది. ఇది శ్రీరామాయణ వృత్తాంతం.

**54. కణ్డువన్దేన్ ఎన్ఱేనో, తిరువడియైప్పోలే**

వాలివధకు తరువాత శ్రీరాముడు రెండు నెలలపాటు వర్షాకాల సమయాన్ని కిష్కింధలో గడిపాడు, తరువాత వానరసేనలను, సుగ్రీవుని ద్వారా పిలిపించి, అన్ని దిక్కులలోను సీతాన్వేషణ కోసం పంపించాడు.

హనుమంతుడు దక్షిణదిశగా పయనించి, దక్షిణసముద్రాన్ని ఆకాశమార్గం ద్వారా దాటి లంకలోని అశోకవనంలో సీతను చూచాడు. ఆమెకు తనపట్ల నమ్మకం కల్గడంకోసం పలు గుర్తులను పలికాడు. **"అత్తకు శీర్ అయోత్తియర్ కోన్ అడైయాళమ్ ఇవై"** అని అంటూ ''ఇది శ్రీరాముని అంగుళీయకం'' అని శ్రీరాముడు ఇచ్చిన వేలి ఉంగరాన్ని ఆమెకు చూపించాడు.

సీతాదేవి అతనిని విశ్వాసించి, శ్రీరాముని క్షేమవార్తను తెలిసి సంతోషించింది. తలపై ఆ ఉంగరాన్ని పెట్టుకొని ఆనందించి, తన శిరోమణిని హనుమంతునకు ఇచ్చి దానిని తన గుర్తుగా శ్రీరామునకు చూపమన్నది. హనుమంతుడు దానిని తీసికొని, శత్రువుల బలం ఎంతటిది? అని శ్రీరాముడు ప్రశ్నిస్తే తెలుపడం కోసం అశోకవనాన్ని పాడుచేసి, రాక్షసులను సంహరించి రావణుని చూచి, అతనికి హితాన్ని పలికాడు. తన తోకకు అంటించిన నిప్పుతో లంకను అంతా భస్మం చేసి, తిరిగి శ్రీరాముని దగ్గరకు వచ్చి **"దృష్టా సీతా"** అని తాను సీతను దర్శించిన విషయాన్ని నివేదించాడు.

భగవంతుడైన శ్రీరామునకు కైంకర్యం చేయడంలో అభినివేశాన్ని పొంది, ఆ స్వామి సంతోషించేటట్లుగా హనుమంతునివలె నేను ఏమయినా చేశానా? అనే అభిప్రాయంతో **"తిరువడియైప్పోలే కణ్డువన్దే నెన్టేనో"** అని తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై పల్కింది.

## 55. ఇరుకైయుమ్ విట్టేనో, ద్రౌపదియైప్పోలే

దుర్యోధనుని ఆజ్ఞానుసారం దుశ్శాసనుడు పాండవులపత్ని ద్రౌపదిని అంతఃపురం నుండి ఆమె కేశాలను పట్టుకొని లాగుతూ సభలోనికి తీసికొని వచ్చి అందఱి ముందు నిలిపాడు. ఆమెను వివస్త్రను చేయడానికి ప్రయత్నించాడు.

అపుడు ఆ ఆపత్సమయంలో, ద్రౌపది, సభలో ఉండే ధృతరాష్ట్రుడు, భీష్ముడు మొదలైనవారిని చూచి ''ఇతడు ఈ విధంగా తగని పని చేస్తూ ఉంటే మీరు ఊరుకుంటారా? న్యాయమేనా?'' అని ఆక్రందించింది. వారెవ్వరూ ఏమీ బదులివ్వలేదు. తన భర్తలు పాండవులైనా కాపాడతారేమోనని చూచింది. వారుకూడా నిస్సహాయస్థితిలో ఉన్నట్లు గ్రహించింది. ''ఇక భగవంతుడైన శ్రీకృష్ణుడే తనను రక్ష'' -అనే విశ్వాసంతో తన రెండు చేతులను జోడించి, శ్రీకృష్ణునకు నమస్కరించి, **"హే కృష్ణ ద్వారకావాస !"** అని పిలచి, **"శంఖచక్రగదాపాణే! ద్వారకానిలయాచ్యుత, గోవింద! పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్"** అని అర్థించింది. శ్రీకృష్ణుడు ఆమెకు తరగని వస్త్రాన్ని దానం చేసి, ఆమె శీలాన్ని కాపాడాడు.



మనలను మనం రక్షించుకొనగల్గిన శక్తిని కలవారం కాము, భగవదనుగ్రహమే మనకు రక్ష- అనే నిశ్చయం ద్రౌపదికి కల్గింది. ఆవిధంగా నాకు నిశ్చయం కల్గింది? లేదే!- అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"ద్రౌపదియైప్పోలే ఇరుకైయుమ్ విట్టేనో"** అని పల్కింది.

## 56. "ఇట్టు పాల్ పొఙ్గుమ్" ఎన్టేనో, వడుగనంబియైప్పోలే"

భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించినవారిలో వడుగనంబి ఒకరు. వీరి ఆచార్యనిష్ఠ నిరుపమానం. శ్రీరామానుజుల అంతరంగశిష్యులై, వారి శ్రీచరణాలే ఉపాయం, ఉపేయం - అని విశ్వసించి, వారి శ్రీపాదుకలకే తిరువారాధనను చేసికొనేవారు. శ్రీరామానుజులతో కలసి శ్రీరంగనాథుని సేవించాలని పోయినపుడు కూడా వారి తిరుమేనినే దర్శిస్తూ వెళ్ళేవారు.

ఒకనాడు, శ్రీరామానుజులు వడుగనంబిని ''శ్రీరంగనాథుని నేత్రసౌందర్యాన్ని దర్శించు'' అని అన్నారు. వడుగనంబి ముందు రంగనాథుని నేత్రాలను సొబగును, తరువాత శ్రీరామానుజుల నేత్రాల అందాన్ని దర్శించి, **"ఎన్ అముదినై క్కణ్డ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** అని అన్నారట.

మఱి ఒకనాడు, వడుగనంబి శ్రీరామానుజులకు భోగ్యంగా పాలను కాచి సిద్ధం చేసేటపుడు, శ్రీరంగనాథునకు తిరువీథి ఉత్సవం జరుగుతున్నది. శ్రీరామానుజులు శ్రీరంగనాథుని సేవించాలని బయలు దేరి, ''వడుగనంబీ! శ్రీరంగనాథుని సేవించడానికి నీవు కూడా నాతో రా!'' అని పిలిచారు. ''మీ పెరుమాళ్ళను సేవించడంకోసం వస్తే, నా పెరుమాళ్ళకు నేను కాస్తున్న పాలు పొంగిపోతాయి. అందువల్ల నేను రాను'' అని అన్నారు.

ఈ రీతిలో ఆచార్యుల తప్ప ఇంకొక దైవాన్ని తెలియని వడుగనంబి వంటి దాననా? నేను? కాదుకదా!- అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై- **"ఇట్టు పాల్ పొఙ్గుమ్ ఎన్టేనో, వడుగనంబియైప్పోలే"** అని పల్కింది.

## 57. ఇరుమిడఱు పిడిత్తేనో, శెల్వపిళ్ళైప్పోలే

శ్రీరామానుజులు తిరునారాయణపురంలో కొంత కాలం వేంచేసి ఉన్నారు. అక్కడ పూర్వం వేంచేసి ఉండే తిరునారాయణస్వామి అర్చామూర్తి లేకపోవడం గమనించి, చాలా క్లేశపడ్డారు. తిరునారాయణస్వామి శ్రీరామానుజులకు స్వప్నంలో సాక్షాత్కరించి "కల్యాణిసరస్సుకు దక్షిణదిశలోని సంపెంగ తోటకు సమీపంలో తులసీ వృక్షాలకింద పెద్ద పుట్టలో మేమున్నాము మమ్ములను బయటకు తీయించండి'' అని పలికాడు. తన శిష్యుడు, ఆ ప్రాంతాన్ని పాలించే ప్రభువైన విష్ణువర్ధనుని సహాయంతో శ్రీరామానుజులు వెళ్ళి చూడగా పుట్టలో తిరునారాయణస్వామి మూలమూర్తి కన్పించింది. ఆ మూర్తిని బయటకు తీయించి, క్షీరంతో అభిషేకం చేయించి, **"పకల్ కణ్డేన్ నారణనై క్కణ్డేన్, కనవిల్ మిక క్కణ్డేన్ మీణ్డు అవనై మెయ్యే మిక క్కణ్డేన్"** అనే రీతిలో తిరునారాయణస్వామిని సేవించి, ఆనందించి, ఆ మూర్తికి స్వయంగా మూడు దినాలు ఆరాధించారు. ఆ స్వామికి తిరువాయ్మొ*ళి* ప్రబంధంలోని **"ఒరు నాయకమాయ్" (4-1)** అనే దశకాన్ని సమర్పించారు. స్వామికి ఆలయాన్ని గోపురాలను నిర్మింపజేశారు.

తరువాత పాంచరాత్రాగమానికి చెందిన సాత్త్వత సంహితానుసారంగా ప్రోక్షణాదులను చేయించారు. నిత్యోత్సవపక్షోత్సవ మాసోత్సవాదులను నిర్వహించడానికి అనువుగా అక్కడ ఉత్సవమూర్తి లేనందున వ్యాకులపడ్డారు. రామప్రియులనే ఆ ఉత్సవమూర్తి శ్రీరామానుజులకు కలలో కన్పించి, ప్రస్తుతం తాను ఢిల్లీ నగరంలో తురుష్కప్రభువు గృహంలో ఉన్నట్లు, అక్కడకు వెళ్ళి ఆ ప్రభువును అడిగి తిరిగి, తిరునారాయణపురానికి తనను తీసికొనివెళ్ళమని తెలిపాడు.

శ్రీరామానుజులు ఢిల్లీనగరికి చేరి, తురుష్కప్రభువును కలిశారు, తాము వచ్చిన కార్యాన్ని గూర్చి అతనికి తెలిపి, తిరునారాయణస్వామి ఉత్సవమూర్తి రామప్రియులను తమకు ఇవ్వమని అడిగారు. "మీ స్వామిని మీరే పిలవండి. ఆయన వస్తే తీసికొని వెళ్ళండి'' అని ఆప్రభువు అన్నాడు. ఆమూర్తి మీ అంతఃపురంలో ఉన్నదని రామానుజులు అన్నారు. "అయితే అక్కడికే వెళ్ళి తీసికొనండి'' అని తురుష్కప్రభువు పలుకగా, శ్రీరామానుజులు



అంతఃపురాన్ని చేరి, పెరియా*ళ్వా*ర్ల "తొడర్ శఙ్గిలి కైశలార్ పిరారెన్న" అనే పాశురాన్ని అనుసంధించి, రామప్రియులను రమ్మని పలిచారు. ఆ మూర్తి ఆశ్రిత వాత్సల్యగుణాన్ని ప్రకాశింపజేస్తూ, మువ్వల సవ్వడి మధురంగా విన్పించగా, కస్తూరీతిరునామంతో అందఱు చూస్తూ ఉండగా గబగబ కదులుతూ వచ్చి శ్రీరామానుజుల ఒడిలో చేరారు. శ్రీరామానుజులు పులకాంకితగాత్రులై, గుండెలు ఉప్పొంగగా, "నా శెల్వపిళ్ళా! రా ! రా'' అని ఎత్తుకొని ముద్దాడి, శిరస్సును ఆఘ్రాణించారు. శెల్వపిళ్ళై అపుడు తన రెండు చేతులతో శ్రీరామానుజుల కంఠాన్ని చుట్టి కౌగలించుకొన్నాడు.

శెల్వపిళ్ళై (శ్రీరామానుజులపట్ల గొప్ప ప్రేమను చూపించినట్లు నేను కూడా చూపించానా? అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"శెల్వప్పిళ్ళైయై ప్పోలే ఇరుమిడఱు పిడిత్తేనో"** అని పల్కింది. (ఇక్కడ **"ఇరుమిడఱు"** అంటే గొప్పదైన కంఠమని అర్థం. **"ఇరు"**- అంటే గొప్పతనాన్ని కల్గిన- అని అర్థం.) ఇది శ్రీరామానుజ చరిత్రలోని వృత్తాంతం.

## 58. నిల్లెన్ను పె*ఱ్ఱే*నో ఇళైయా*ఱ్ఱు*క్కుడి నమ్బియైప్పోలే

ఈ వృత్తాంతం తిరువాయ్మొ*ళి*లోని **"కణ్ణపిరాన్ తన్ మలరడిప్పోదు కళే ఎప్పోదుమ్ మనత్తు ఈఙ్గు నినైక్కప్పెఱ వాయ్కుఙ్గొల్ !" (7-10-4)** అనేసూక్తిని నమ్బిళ్ళై అనుగ్రహించిన ఈడు వ్యాఖ్యానంలో గోచరిస్తుంది.

శ్రీరంగంలో శ్రీరంగనాథునకు ప్రతిసంవత్సరం నాల్గు బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. ఇడైయా*ఱ్ఱు*ప్పిళ్ళై అనే భక్తులొకరు ప్రతి ఉత్సవానికి అంకురారోపణం జరిగేనాడే వచ్చి, ఉత్సవం పూర్తి అయేవరకు ఉండి సేవించి తిరిగి వెళ్ళేవారు. మఱి ఒక ఉత్సవం జరిగేవరకు అంతకు ముందు తాము సేవించిన అనుభవాన్ని స్మరిస్తూ కాలం గడిపేవారు. ఇదే వారి మనస్సుకు భోజనం. "భుజించడానికి సమయం అవుతున్నది'' అని అంటే "మళ్ళీ ఉత్సవాలు జరుగుతున్నాయా?'' అని వారు అడిగేవారట.

క్రమంగా ఇడైయా*ఱ్ఱు*నమ్బి నూఱు సంవత్సరాల వయస్సు వచ్చిన వృద్ధులయ్యారు. అందువల్ల తమ ఊరినుండి శ్రీరంగానికి ఉత్సవాలను సేవించడానికి వెళ్ళలేని స్థితి వారికి ఏర్పడింది. అందువల్ల ఒకసారి ఉత్సవాలలో

ఆఖవనాటికి మాత్రం వారు వెళ్ళగలిగారు. ఉత్సవం మొదటి నాడే శ్రీరంగనాథుడు "ఇడైయాఱ్ఱునమ్బి రాలేదే?" అని వెదకి ప్రశ్నించాడు. (**"నమ్ కణ్ణాలత్తుక్కు ఇడైయాఱ్ఱుక్కుడియాన్ వన్దిలన్"** (నా ఉత్సవానికి ఇడైయాఱ్ఱుక్కుడియాన్ రాలేదు) అని అన్నాడు. ఆఖవనాటి ఉత్సవంలో పిళ్ళైను చూచి, "నీకొక వరం ఇస్తాను తీసికో" అని అన్నాడు. పిళ్ళై "నీవు నాకిచ్చిన ఈ శరీరంతో పలు దినాలు సేవించాను. ఆనందించాను. వార్థకం వచ్చిన ఈ శరీరం రాకపోకలకు తగినదిగా లేదు స్వామీ!'' అని అన్నారు. అయితే **"అత్రైవ శ్రీరంగే సుఖమాస్వ"** అనే రీతిలో ఇక్కడే ఉండు'' అని పల్కి, శ్రీరంగనాథుడు వేఱొక వీధికి వేంచేయగానే నమ్బి అక్కడే పరమపదించారు.

ఈ విధంగా ఇడైనమ్బివలె నమ్బెరుమాళ్ ఉత్సవాలను సేవించి, దానినే ప్రతిదినం స్మరించి, చివరకు భగవానుని అనుగ్రహాన్ని పొందానా?- అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"ఇడైయాఱ్ఱుక్కుడి నమ్బియైప్పోలే నిల్లెన్టు పెఱ్ఱేనో?"** అని పల్కింది. ఇది నాథముని చరిత్రలోని వృత్తాంతం. తిరువాయ్మొழி వ్యాఖ్య ఈడులో **4-48**వ పాశుర వివరణంలో ఈవృత్తాంతం ప్రస్తావింపబడింది.

## 59. నెడు దూరమ్ పోనేనో, నాథమునియైప్పోలే

మన పూర్వాచార్య పరంపరలో ప్రముఖులు నాథమునులు. వీరు యోగనిష్ఠులు. ఒకనాడు నాథమునులు యోగనిష్ఠులై ఉన్నారు. వారు యోగసమాధి నుండి బయటకువచ్చిన తరువాత, ఇద్దఱు విల్లును ధరించిన వ్యక్తులు, ఒకరు, ఒక వానరం వచ్చి వెళ్ళినట్లు, శిష్యులు చెప్పగా విన్నారు. "అయ్యో! వచ్చినవారు శ్రీరాముడు, లక్ష్మణుడు, సీతాదేవి, హనుమంతుడు కదా! వారిని నేను సేవించలేకపోయానే!'' అని వారు వెళ్ళిన దిక్కులో వారిని వెదుకుతూ వెళ్ళారు. దారిలో ఒకచోట కోతి అడుగుజాడలు కన్పించాయి. (ఇప్పటికీ ఆప్రదేశానికి **"కురజ్గడి"** అని పేరు) దానిని అనుసరిస్తూ వారు చాలా దూరం వెళ్ళగా ఒకచోట పూవు రాలి పడింది. (ఈ చోటు ఈనాటికీ **"పూవిழுన్దనల్లూర్"** అని పిలువబడుతున్నది) చాలా దూరం ప్రయాణం చేసినా శ్రీరాముడు మొదలైనవారిని నాథమునులు దర్శించలేక, వారిని చూడలేకపోయామనే ఆర్తితో మూర్ఛిల్లి తిరునాడు చేరుకొన్నారు.



నాథమునులవలె నేనుకూడా పరమపురుషుని అన్వేషిస్తూ చాలా దూరం పోయానా? అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై **"నెడున్దూరమ్ పోనేనో, నాథమునియైప్పోలే"** అని పల్కింది. ఇది నాథముని చరిత్రలోని వృత్తాంతం. తిరువాయ్మొழி వ్యాఖ్య ఈడులో **4-48**వ పాశుర వివరణంలో ఈ వృత్తాంతం కనిపిస్తుంది.

## 60. అవన్ పోనాన్ ఎన్టేనో, మారుతి యాణ్డాన్పోలే

చోళమండలాన్ని పాలించిన చోళరాజు ఒకడు **"శివాత్ పరతరం నాస్తి"** అని ఒక చీటి వ్రాసి, దానిలో పండితులందఱిచేత సంతకం పెట్టమని ఆదేశించాడు. వారుకూడా అతని క్రూరస్వభావానికి భయపడి, ఇష్టం లేకపోయినా సంతకం చేశారు. భగవద్రామానుజులను కూడా తన సభకు పిలిపించి, అందఱి ముందు ఆ చీటిలో వారిచే సంతకం చేయించాలని చోళరాజు భావించాడు. తన భటులను శ్రీరామానుజులను సభకు తీసికొనిరమ్మని పంపాడు. ఆ సంగతిని కూరేశులు ముందుగా గ్రహించి, చోళరాజువల్ల శ్రీరామానుజులకు కలుగబోయే అపాయంనుండి వారిని రక్షించదలచి, వారి త్రిదండ కాషాయాలను తామే ధరించి, తామే శ్రీరామానుజులమని అంటూ రాజభటులతో రాజసభకు వెళ్ళారు.

అపుడు శ్రీరామానుజులు చోళరాజ్యం విడచి కొంతకాలం దూరొంగా ఉండడమే శ్రేయస్కరమని తలచి, పడమటిదిశగా ప్రయాణం చేసి, తిరునారాయణపురాన్ని చేరారు. అక్కడ వారు ఇంచుమించు పన్నెండు సంవత్సరాల కాలం ఉన్నారు. తరువాత క్రిమికంఠుడనే ఆ చోళరాజు మరణించగా, ఆసంగతిని, మారుతియాణ్డాన్ అనే ఆచార్యులు శ్రీరామానుజులకు తెలుపాలని బయలుదేరి తిరునారాయణపురానికి వచ్చారు.

వారు తిరునారాయణపురానికి చేరే సమయానికి, శ్రీరామానుజులు తమ శిష్యులతో కలసి అనుష్ఠానంకోసం కల్యాణితీర్థానికి బయలుదేరారు. మారుతియాణ్డాన్ శ్రీరామానుజులను అక్కడ సేవించి, వారికి నమస్కరించి, **"అవన్ పోనాన్"** (వాడు పోయాడు - మరణించాడు) అని విన్నపించారు. శ్రీరామానుజులు దర్శనానికి కల్గిన ఉపద్రవం తీరింది కదా -అని సంతోషించి.

మారుతియాణ్డాన్‌ను ఆలింగనం చేసికొన్నారు, తాము శ్రీరంగనాథుని ఎపుడు సేవించగలనా? - అనే ఆతురతతో ఎదురు చూచిన శ్రీరామానుజులకు ఇది చాలా తీయని వార్త అయినది. **"అవన్"** అనే పదం అవ్యపదేశ్యత్వాన్ని తెల్పుతుంది.

ఇదేవిధంగా నేనుకూడా ఆచార్యులకు తీయని వార్తను వినిపించానా?- అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్‌పిళ్ళై - **"అవన్ పోనాన్ ఎన్టేనో, మారుతియాణ్డాన్ పోలే"** అని పల్కింది.

## 61. అవన్ వేణ్డా ఎన్టేనో, ఆళ్వానైప్పోలే

చోళరాజువల్ల కల్గిన ఉపద్రవం కారణంగా శ్రీరామానుజులు మేల్‌నాడు ప్రాంతానికి చేరిన తరువాత, పెరియనంబితోపాటు చోళరాజసభకు వెళ్ళిన కూరేశులు, పెరియనంబి- అనే ఇద్దఱిలో, పెరియనంబి చోళరాజు దుష్కృతంవల్ల నేత్రాలను కోల్పోయి, దానివల్ల కల్గిన వేదనను భరించలేక పరమపదించారు. తరువాత కూరేశులు కొన్నాళ్ళకు శ్రీరంగాన్ని చేరారు.

ఒకనాడు, కూరేశులు, శ్రీరంగనాథుని దర్శించాలని కోవెల లోపలకు వెడుతూ ఉండగా, దారిలో చోళరాజు భటులు వారిని చూచి "మీరు శ్రీరామానుజుల శిష్యులుకదా!" అని అడిగారు. కూరేశులు అవునని అన్నారు. సేవకులు వారిని ఆలయం లోపలకు అనుమతించకుండా అడ్డుకొని, "మీకు శ్రీరామానుజులతో సంబంధం లేదని ఒప్పుకొంటేనే, మిమ్ములను లోపలకు పంపిస్తాము'' అని అన్నారు. అపుడు కూరేశులు - "ఆచార్యసంబంధాన్ని వీడి పెరుమాళ్‌ను సేవించాలా? అటువంటి పెరుమాళ్ళ సేవే నాకు అక్కరలేదు.'' అని పల్కి శ్రీరంగనాథుని సేవించకుండానే తిరిగి వెళ్ళిపోయారు. ఈవృత్తాంతం తిరుప్పావై ప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై అనుగ్రహించిన మువాయిరప్పడివ్యాఖ్యలో 15వ పాశురవ్యాఖ్యలో ఉన్నది.

ఆచార్యుల తిరునామసంబంధం అంగీకరింపబడని చోట పెరుమాళ్ళను సేవించే ఉద్దేశ్యం లేదు - అని కూరేశులు పల్కిన రీతిలోని ఆచార్యనిష్ఠను నేను కల్గి ఉన్నానా? అనే భావంతో తిరుక్కోళూర్ప్పెణ్‌పిళ్ళై **"ఆళ్వానైప్పోలే అవన్ వేణ్డా ఎన్టేనో?"** అని పల్కింది. ఇది కూరేశ చరిత్రలోని వృత్తాంతం.



## 62. అద్వైతమ్ వెన్టేనో, ఎమ్బెరుమానారైప్పోలే

యజ్ఞమూర్తి అనే అద్వైతబ్రాహ్మణ పండితుడు కాశీప్రాంతానికి పోయి, గంగాస్నానాన్ని చేసి, అక్కడ ఉండే విద్వాంసులను చాలామందిని జయించి, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించాడు. విద్యవల్ల, శిష్యసంపదతో అతిశయాన్ని కలవాడయ్యాడు. కొందఱి ద్వారా శ్రీరామానుజుల వైభవాన్ని తెలిసికొని, వారితో వాదించి, జయించాలని తలచి, తన విద్యాగర్వం వ్యక్తమయే రీతిలో, గొప్ప సంరంభంతో శ్రీరంగానికి వచ్చాడు. భగవద్రామానుజులను తనతో వాదించమని కోరారు. శ్రీరామానుజులు "మీరు ఓడిపోతే ఏంచేస్తారు?'' అని అడిగారు. యజ్ఞమూర్తి "నేను ఓడిపోతే మీ పాదరక్షలను మోస్తూ, మీరు ధరించిన తిరునామాన్ని పెట్టుకొని, మీ మతంలోకి చేరగలను, మఱి మీరు ఓడిపోతే ఏం చేస్తారు?'' అని యజ్ఞమూర్తి అనగా, శ్రీరామానుజులు "నేను ఓడిపోతే గ్రంథసన్న్యాసాన్ని చేస్తాను'' అని బదులిచ్చారు.

వారిద్దరిమధ్య పద్దెనిమిది దినాలు వాదం నడచింది. పదహేఱు దినాలపాటు వాదించినా శ్రీరామానుజులు యజ్ఞమూర్తిని జయించలేక పోయారు. పదిహేడవనాడు వాదం ముగిసేసమయానికి, యజ్ఞమూర్తి అడిగిన ప్రశ్నకు శ్రీరామానుజులు బదులివ్వవలసి ఉన్నది. యజ్ఞమూర్తి ప్రశ్నకు తగిన సమాధానం శ్రీరామానుజులకు ఏమీ స్ఫురించలేదు. ఆనాటిరాత్రి శ్రీరామానుజులు మనస్సులో క్లేశపడి, వరదరాజస్వామిని మనస్సులో ధ్యానించి, "మహర్షుల, ఆళ్వార్ల కాలంనుండి, ఆళవందార్ వరకు **"ఓరాణ్‌వழி"**గా సుప్రతిష్ఠితంగా ఉండే ఈ దర్శనం ఈ నాడు నావల్ల అపజయాన్ని పొందనున్నదా? ఈ వాదంలో నేను గెలిచి వైదికమైన విశిష్టాద్వైతదర్శనం నిలబడేటట్లు నీవే చేయాలి" అని విన్నవించి. భుజించ కుండానే నిద్రించారు. ఆనాటి రాత్రి శ్రీరామానుజులకు స్వప్నంలో వరదరాజ స్వామి సాక్షాత్కరించి, "శ్రీరామానుజా! భయపడకండి. అత్యంతసమర్థుడైన ఈ యజ్ఞమూర్తి మీకు శిష్యుడయేటట్లు చేస్తాను'' అని పల్కి అంతర్ధానమయ్యాడు. శ్రీరామానుజులు నిద్రలేచి, స్వప్నవృత్తాంతాన్ని స్మరించి ఆశ్చర్యపడ్డారు.

మఱునాడు యజ్ఞమూర్తి వాదానికి వచ్చినపుడు శ్రీరామానుజులు - "జ్ఞానరూపమైన బ్రహ్మను అజ్ఞానరూపమైన అవిద్య ఆవరిస్తే, ఆ అవిద్యకు నాశం లేదు - అని తెలుస్తున్నందున, అవిద్య నిత్యం. అవిద్య నిత్యమైతే, బ్రహ్మం కూడా నిత్యం కనుక, అద్వైతం సిద్ధించదు. అద్వైతమనే మీ మదగజం ద్వైతమనే పంకంలో కూరుకుపోయింది కదా!'' అని అన్నారు. యజ్ఞమూర్తి దానికి బదులు పల్కలేక, తాను ఓడిపోయినట్లు అంగీకరించారు. తన చేతిలోని ఏకదండాన్ని త్యజించి, శ్రీరామానుజులను ఆశ్రయించారు. పంచసంస్కారాలను పొంది, సకలరహస్యార్థాలను గ్రహించి, వారికి అంతరంగశిష్యులయ్యారు. రామానుజులు వారికి త్రిదండకాషాయాలను ఇచ్చారు. వరదరాజస్వామివల్ల తమకు లభించిన వీరికి **"అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్"** అనే దాస్యనామాన్ని పెట్టారు. ఎమ్బెరుమానార్ అద్వైతాన్ని జయించిన వృత్తాంతం ఇదే. ఇది శ్రీరామానుజ చరిత్రలోని వృత్తాంతం.

ఈ రీతిలో శ్రీరామానుజులవలె నేనుకూడా మాయావాదులను జయించి, ఈశ్వరతత్త్వాన్ని సుప్రతిష్ఠితం చేశానా? అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"ఎమ్బెరుమానారై ప్పోలే అద్వైతమ్ వెన్ఱేనో!"** అని పల్కింది.

## 63. అరుళా*ఴ*మ్ కణ్డేనో, నల్లానైప్పోలే

శ్రీవైష్ణవ బ్రాహ్మణుడొకడు ప్రతిదినం స్నానార్థం నదికి వెళ్ళడం అలవాటు. ఒకనాడు నదీతీరంలో ఒక ప్రేతాన్ని చూచాడు. ఆ శవం పంచసంస్కారాలను పొందిన వ్యక్తికి చెందినది. దానిని చూచిన అతడు "అయ్యో! ఇది అనాథప్రేతం అయినా, శరీరంపై పంచసంస్కార చిహ్నాలు కన్పిస్తున్నాయే! దీనిని అనాదరించడం తగదు'' అని భావించి, ఆ ప్రేతానికి దహనసంస్కారాలను చేశాడు. ఆ విషయాన్ని తెలిసిన ఆ ఊరిలోని బ్రాహ్మణులు, అది ఒక పంచమవర్ణానికి చెందినవాని శవమని తెలిసి, దానిని ఆ బ్రాహ్మణుడు దహనం చేసినందున, అతనిని తమ జాతినుండి బహిష్కరించారు.

పంచసంస్కారాలను పొందిన దేహాన్ని, అది ఏజాతికి చెందినది? అని గమనించకుండా దహనం చేసిన ఆ బ్రాహ్మణుని దయాస్వభావాన్ని చూచిన



భగవంతుడు అర్చకావేశముఖంగా **"నీర్ నాట్టుక్కు పొల్లాన్, నమక్కు నల్లాన్"** కనుక, ఇకనుండి మీరు, మీ వంశంలోని వారు **"నల్లాన్ చక్రవర్తి"** అనే ఉపపదంతో వ్యవహరింపబడతారు'' అని అన్నాడు. ఆవిధంగా ఆ శ్రీవైష్ణవుని వంశానికి చెందినవారు ఈనాటికీ **"నల్లాన్ చక్రవర్తి"** అనే ఉపనామంతో వ్యవహరింపబడుతున్నారు.

## 64. అనంతపురమ్ పుక్కేనో, ఆళవందారైప్పోలే

శ్రీరంగదివ్యాలయాలలో అధ్యయనోత్సవాలలో తిరువరంగప్పెరుమాళ్ అరైయర్ "కెడుమిడరాయ వెల్లామమ్ కేశవావెన్న... విడముడై యరవిల్ పళ్ళి విరుమ్బినాల్ శురుమ్బల***ఱ్ఱు***మ్ తడముడై వయల్ అనన్దపురనకర్ పుకుదుమ్ ఇన్ఱే" అనే తిరువాయ్‌మొ*ఴి*ని (దశకాన్ని) అభినయిస్తూ పాడుతూ, యామునుల ముఖం వైపు మాటిమాటికి చూచి **"నడమినో నమర్‌కళుళీర్ ! నామ్ ఉమక్కఱియ చ్చొన్నోమ్"** అని పలుమార్లుగా గానం చేశారు. ఆళవందార్ దానిని విని, అపుడే శ్రీరంగనాథునకు, తిరువరంగ ప్పెరుమాళ్ అరైయర్‌కు దండం పెట్టి, వారి అనుమతిని తీసికొన్నారు. మఠానికి కావలిగా తమ ప్రధానశిష్యులైన దెయ్‌వవారి ఆణ్డాన్‌ను నియమించి, తిరువనంత పురానికి బయలుదేరారు. అక్కడ వేంచేసి ఉండే అనంతపద్మనాభస్వామిని సేవించి, శ్రీరంగానికి తిరిగి వచ్చారు. ఈవిధంగా అరైయర్ చూపిన సూచనను అనుసరించి శ్రీయామునులు వర్తించారు. ఈ వృత్తాంతం తిరువాయ్‌మొ*ఴి* వ్యాఖ్యానం ఈడులో 10-2-8వ పాశుర వివరణలో కన్పిస్తుంది.

"ఈవిధంగా పెద్దల భావాన్ని అనుసరించి వర్తించడమే గొప్ప ఉజ్జీవనం. పెద్దల సూచనను బట్టి నడచుకోవడమనే రీతిలో నేను వర్తించానా ?''- అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"ఆళవన్దారైప్పోలే అనంతపురమ్ పుక్కేనో"** అని పల్కింది.

## 65. ఆరియనై పిరిన్దేనో, దెయ్‌వవారియాణ్డానై ప్పోలే

శ్రీయామునులు, తమ శిష్యులైన దెయ్‌వవారి యాణ్డాన్‌ను మఠానికి కావలిగా పెట్టి, అంనతపద్మనాభస్వామిని సేవించడం కోసం అనంతపురానికి

వెళ్ళారు. మఠానికి కాపలాగా పెట్టిన దెయ్వవారి యాణ్డాన్ తమ ఆచార్యుల విశ్లేషాన్ని సహించలేక కొన్నాళ్ళకు చాలా శుష్కించిపోయారు. అక్కడ ఉండే వారు దారిని గమనించి వైద్యులకు చూపించారు. వైద్యులు వారిని పరీక్షించి చూచి, "వీరు మనోవ్యాధివల్ల ఈవిధంగా చిక్కిపోతున్నారు" అని గ్రహించి, "మీకు మనస్సులో ఏమయినా కొఱత ఉన్నదా?" అని అడిగారు. "నాకు ఆచార్యవిశ్లేషం తప్ప ఇంకొ క్లేశం ఏమీ లేదు" అని దెయ్వవారి ఆణ్డాన్ అన్నారు. అక్కడివారు "అయితే వీరిని వీరి ఆచార్యుల వద్దకు తీసికొనిపోవడమే ఈ వ్యాధికి తగిన మందు" అని పల్కి, వారిని తీసికొని బయలుదేరారు. శ్రీయామునులు తిరువనంతపురం నుండి తిరిగివచ్చే దారి మధ్యలో **"కరైమనైయాఱు"** అనేచోట వేంచేసి ఉండగా, దెయ్వవారి యాణ్డాన్ చాలా ఆర్తితో పరుగెత్తి వచ్చి, వారి చరణాలలో వాలిపోయారు. శ్రీయామునులు వారి దేహం చాలా కృశించి, తెల్లబడిపోయిన కారణాన్నిగూర్చి, అక్కడికి వారు వచ్చిన కారణాన్ని గూర్చి వారితో వచ్చినవారివల్ల తెలిసికొని, "పెద్దలారా! చూచారా! "శ్రీరాముడు స్వతంత్రుడు, క్రూరుడు అయినందున, భరతాళ్వాన్ ఆనాడు శ్రీరాముడు చెప్పిన చోటనే ఉండిపోయాడు. మేమే స్వతంత్రులమే కాక, క్రూరులం కూడా కానందున, ఈనాడు మేము చెప్పిన చోటనే ఉండకుండా వీరు వచ్చారు" అని అన్నారు. ఆ మాటను విన్న దెయ్వవారి యాణ్డాన్ "అయ్యో! స్వరూపహానిని పొందానే!" అని పడినవారు పడినట్లే ఉండిపోయారు. నమస్కరించిన ఆణ్డాన్ తిరిగిపైకి లేవకపోవడం చూచి "నన్ను స్వతంత్రుడను, క్రూరుడను చేస్తే తప్పు, మీరు పైకి లేవరా !" అని యామునులు అన్నారు. దెయ్వవారియాణ్డాన్ మళ్ళీ "అయ్యో! ఇది ఇంకొక స్వరూపహాని కదా !" అని భయపడి, గబగబ పైకి లేచారు. అపుడు అక్కడ ఉండే మిగిలిన యామునుల శిష్యులు "నీటినుండి బయటపడి తీరంపై ఉండే చేపవలె, శ్రీరాముని వీడితే వాడిపోయే లక్ష్మణునివలె, ఈ దెయ్వవారి యాణ్డాన్ కూడా ఆచార్యవిశ్లేషం వల్ల పడినపాట్లు ఇవి" అని అన్నారు. ఆళవందార్ "ఇది కూడా ఒక విశేషం కదా!" అని భావించి, ఆణ్డాన్‌తో 'ఆణ్డాన్! చాలా చిక్కిపోయారుకదా!" అని వారి నడుమును స్పృశించి, తిరువనంతపుర గోపురాన్ని చూపి, "మీరు కూడా వెళ్ళి వేయి పడగల ఆదిశేషునిపై శయనించి



ఉండే జగత్కారణుని సేవించిరండి" అని అన్నారు. అపుడు ఆణ్డాన్ "దాసుని అనంతపురం ఎదురుగా ఉండగా, ఇక అక్కడికి వెళ్ళడం ఎందుకు?" అని విన్నపించగా, వారి అధ్యవసాయానికి యామునులు చాలా సంతుష్టులై, వారిని కౌగలించుకొని శ్రీరంగానికి బయలుదేరారు. ఇది వార్తామాలై గ్రంథంలో **209**వ వార్తగా తెలుపబడింది.

ఆచార్యుని వీడి ఉండలేనందున దెయ్వవారి యాణ్డాన్‌కు దేహం కృశించింది. అటువంటి అధ్యవసాయదశ నాకు కల్గిందా? అనే భావనతో తిరుక్కోళూర్ప్పెణ్పిళ్ళై **"ఆరియనై ప్పిరిన్దేనో, దెయ్వవారియాణ్డానైప్పోలే"** అని పల్కింది.

## 66. అన్దాది శొన్నేనో, అముదనారైప్పోలే

అముదనార్ శ్రీరంగంలో నివసించిన కారణంచేత **"పెరియ కోయిల్‌నంబి"** అనే పేరుతో ప్రసిద్ధులయ్యారు. వీరు సకల శాస్త్రాలలో సమర్థులైన గొప్ప పండితులు. తమకు కులక్రమంగా లభించిన శ్రీరంగాలయ సన్నిధి పౌరోహిత్యాన్ని, పురాణపఠనాన్ని, కుంచెకోల (బీగపుచెవి) మొదలైన సకలవిధబాధ్యతలను కల్గి, చాలా గర్వంతో మెలిగేవారు. శ్రీరామానుజులు, తమ నిర్హేతుక కృపాకటాక్షంతో, అముదనార్‌ను సంస్కరించాలని భావించి, ఆ పనికోసం కూరేశులను నియమించారు. అముదనార్‌ను కూరేశులు అనువర్తిస్తూ, వారిలో జ్ఞానదీపాన్ని వెలిగించి, శ్రీరామానుజుల శ్రీచరణాల వద్దకు చేర్చారు. అముదనార్ కూరేశులను ఆశ్రయించేటట్లు శ్రీరామానుజులు నియమించగా, కూరేశులు వారికి పంచసంస్కారాలను ప్రసాదించి, తత్త్వహితపురుషార్థాలను సందేహవిపరీత జ్ఞానాదులు లేని రీతిలో తెలిపారు.

అముదనార్ తమ ఆచార్యులైన కూరేశుల ప్రీతికి హేతువుగా తమ ప్రాచార్యులైన శ్రీరామానుజుల విషయంగా ఒకటి రెండు ప్రబంధాలను రచించి, వాటిని శ్రీరామానుజుల సన్నిధిలో సమర్పించారు. వారు వానిని పూర్తిగా చూచి, అవి తమ అభిప్రాయానికి అనుగుణంగా లేనందున, ఆ గ్రంథాలను చించి పారవేశారు. అముదనార్‌ను చూచి "మీకు నాగూర్చి ప్రబంధాన్ని రచించాలనే అభిప్రాయం ఉంటే, మీకు పూజ్యులైన ఆళ్వాన్‌ను,

మాకు పూజ్యులైన ఆళ్వార్లను, వారు అభిమానించిన దేశాలను, ప్రస్తావిస్తూ ఒక ప్రబంధాన్ని రచించండి'' అని నియమించారు. అముదనార్ అపుడు "ఆ విధంగానే తప్పక చేస్తాను'' అని పల్కి, ఆ మాటను శిరసా వహించి వహించి, శ్రీరామానుజుల పట్ల భక్తిని కలవారికి సావిత్రివలె, ఇది నిత్యం. అనుసంధేయం విషయం కావాలి" అని ప్రతి పాశురంలోను శ్రీరామానుజనామాన్ని కూర్చి, 108 పాశురాలను కల ప్రబంధమైన ఇరామానుశ నూఱ్ఱన్దాదిని రచించి, శ్రీరామానుజుల సన్నిధిలో సమర్పించారు. "దీనిని ఆలకించి కటాక్షించాలి'' అని దానిని వారి సన్నిధిలో విన్నపించారు. శ్రీరామానుజులు తమ శిష్యులతో కలసి దానిని ఆలకించి, శిరస్సును సంతోషంతో ఊగిస్తూ చాలా ఆనందించారు. తమ సంబంధాన్ని కలవారికి అందటికి ఆ ప్రబంధాన్ని ఆనాటినుండి సదా నిత్యానుసంధేయమయేటట్లు నియమించారు. అంతేకాక, వారికి "అముదనార్" అనే తిరునామాన్ని అనుగ్రహించారు. ఆనాటి నుండి పెరియకోయిల్‌నంబికి **"తిరువరంగత్తముదనార్"** అనే తిరునామం, ఇరామనుశనూఱ్ఱన్దాది ప్రబంధానికి **"ప్రపన్నగాయత్రి"** అనే తిరునామం ప్రసిద్ధంగా ఏర్పడినవి.

వీరు ఈవిధంగా రచించిన ప్రబంధంలోని ఏడవ పాశురంలో **"మొழிయై క్కడక్కుమ్ పెరుమ్ పుకழாన్ వఞ్జముక్కుఱుమ్బామ్ కుழிయైక్కడక్కుమ్ నమ్ కూరత్తாழ్వాన్ శరణ కూడియ పిన్"** అని తమ ఆచార్యులైన కూరేశుల తిరునామాన్ని ప్రస్తావించారు.

అముదనార్‌వలె ఆచార్యాభిమానం వ్యక్తమయేటట్లుగా వారి గుణాలను పాడి కీర్తించానా ?- అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్పిళ్ళై **"అముదనారైప్పోలే అన్దాది శొన్నేనో"** అని పల్కింది.

## 67. అనుకూలమ్ శొన్నేనో, మాలియవానైప్పోలే

మాల్యవంతుడు రావణుని తాత. చాలా బుద్ధిమంతుడు. అతడు రావణునితో "రాక్షసప్రభువు అయిన నీవు పలు రీతులలో శ్రీరామునితో శత్రుత్వాన్ని కల్గి ఉండడం తగదు. దేవతలు, ఋషులు, గంధర్వులు మొదలైన వారంతా శ్రీరామునకే జయం కలగాలని కోరుతున్నారు. నీవు దేవ-రాక్షస-గంధర్వాదులవల్ల మరణం సంభవించకూడదని వరం వేడావే తప్ప, మానవులను, వానరులను లెక్కించలేదు. ఇపుడు, మహాపరాక్రమశాలులైన మానవులు, వానరులు ఇక్కడకు వచ్చి పోరాడుతున్నారు. వీరివల్ల నీకు మరణం కలుగకుండా అడ్డుకోలేవు. ఈ శ్రీరాముడు మానవమాత్రుడు కాడు. మహావిష్ణువే రాక్షసులను వధించడంకోసం మానవరూపాన్ని ధరించి వచ్చాడు- అని గ్రహించు. అందువల్ల అతనిని ఎదిరించడం మాని, విధేయుడవై వర్తించడం తగినది''- అని హితవును పలికాడు. ఇది శ్రీరామాయణంలోని వృత్తాంతం.

ఈవిధంగా మాల్యవంతుని వలె నేను, క్రూరమనస్కుడైనవానిని కూడా మార్చడంకోసం ఏదైనా హితాన్ని పలికానా?- అనే అభిప్రాయంతో **"మాలియవానైప్పోలే అనుకూలమ్ శొన్నేనో!"** అని తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై పల్కింది.

## 68. కళ్వనివన్ ఎన్డేనో, లోకగురువైప్పోలే

ఇంద్రుని జయించి, అతని ముల్లోకాలను స్వాధీనం చేసికొని, దేవతలను ఎంతమాత్రం లెక్కించకుండా అవమానించిన మహాబలి గొప్ప యాగాన్ని, అంతు లేని దానాన్ని చేయాలని తలచాడు. దేవతలు "ఇది తమకు కీడు చేస్తుంది'' అని తలచి, తమను రక్షించమని శ్రియఃపతిని ప్రార్థించారు. శ్రీమన్నారాయణుడు దేవతల ప్రార్థనను నెరవేర్చడం కోసం కశ్యపునకు, అదితికి కుమారుడై వామనుని రూపంలో అవతరించి, మహాబలి యజ్ఞవాటికలో ప్రవేశించాడు.

వామనుని రూపాన్ని దర్శించినంతనే, ఆ రూపంలోని అద్భుత సౌందర్యానికి ముగ్ధుడైన మహాబలి, వామనుని స్వాగతించి, "బ్రాహ్మణశ్రేష్ఠా! నిన్ను దర్శించిన నాకంటే ధన్యులెవ్వరూ లేరు'' అని అన్నాడు. అపుడు వామనుడు "మహాబలీ! నీనుండి నేనొక దానాన్ని పొందగోరి వచ్చాను. నీవల్ల దానాన్ని పొందడం ఒక గొప్ప భాగ్యం. నీవంటి దాతలు ఇంకొకరు లేరు''అని మహాబలిని పొగడాడు. బలి అపుడు - "నేను నీకు దానంగా ఏమివ్వాలి? మణులా? మాన్యాలా? రాజ్యమా? ఏమి కావాలన్నా ఇస్తాను అడుగు'' అని అనగా, వామనుడు "నా పాదం పరిమితిలో మూడడుగుల నేలను నాకు దానం ఇవ్వాలి'' అని అన్నాడు. వెంటనే బలిచక్రవర్తి "సరే, ఆవిధంగానే ఇస్తాను'' అని మాట ఇచ్చాడు.

బలి వాగ్దానాన్ని విన్న కులగురువు శుక్రాచార్యులు మహాబలి ఇచ్చేదానం అతనికి హానికరమని తెలిసి, "అయ్యో ! ఈ రూపం మాయావేషాన్ని ధరించి వచ్చిన విష్ణుస్వరూపం. అన్ని బ్రహ్మాండాలను పాలించే శ్రీమన్నారాయణుడే ఈ రూపంతో నిన్ను మోసగించాలని వచ్చాడు. ఈవిషయాన్ని గ్రహించు. ఈదానాన్ని ఇవ్వకు'' అని బలికి హితబోధ చేశాడు. శుక్రుడు పల్కిన మాటను బలి ఏమాత్రం వినలేదు. దానజలధారాపూర్వకంగా మూడడుగుల నేలను వామనునకు దానం ఇవ్వబోయాడు. అపుడు శుక్రుడు ఒక కీటక రూపాన్ని ధరించి, దానజలాన్ని పోసే కమండలు ద్వారంలో ప్రవేశించి అడ్డుపడ్డాడు. వామనుడు అపుడు తన చేతివేలికి ధరించిన పవిత్రంలోని దర్భమొనతో కమండలం ద్వారంలో గుచ్చి, దారిని సరిచేశాడు. ఆ దర్భకంటిలో గుచ్చుకొన్నందున శుక్రుడు గుడ్డివాడయ్యాడు. బలిచక్రవర్తి దానాన్ని ఇచ్చి ధన్యుడయ్యాడు. ఈ వృత్తాంతాన్ని పెరియాళ్వార్లు **"మిక్క పెరుమ్ పుకழ் మావలివేళ్వియిల్ తక్కదిదన్ఱెన్ఱు తానమ్ విలక్కియ శుక్కిర్ కణ్ణైత్తురు మ్బాల్కిళఱియ శక్కర్కైయనే !"** అని కీర్తించారు. **"ఏష వైరోచనే సాక్షాద్భగవాన్ విష్ణురవ్యయః, కశ్యపాదదితే ర్జాతః దేవానాం కార్యసాధకః, ఏష తే స్థానమైశ్వర్యం శ్రియం తేజో యశః శ్రుతమ్, దాస్యత్యాచ్ఛిద్య శక్రాయ మాయామాణవ కోహరిః... సర్వస్వం విష్ణవే దత్త్వా మూఢ! వర్తిష్య సే కథమ్?"** - ఇత్యాది శ్రీభాగవతం (8వ స్కంధం)లోని 19వ అధ్యాయంలోని శ్లోకాలు భావ్యం.

శుక్రాచార్యుడు వామనుని **"కళ్వన్"** (మోసగాడు) అని అన్నాడు. భగవద్భక్తులు ఈ నామాన్ని భగవానుని విషయంలో వేఱు రీతిలో అనుసంధిస్తారు. స్వామి తన అద్భుతరూపంతో, గుణాలతో, చేష్టలతో భక్తుల మనస్సులను దోస్తాడు కదా!

శుక్రునివలె, భగవంతుని ఈ స్వభావాన్ని తెలిపే **"కళ్వన్"** అనే పదంతో స్వామిని నిర్దేశించానా? అనే భావంతో **"కళ్వనివన్ ఎన్ఱేనో, లోకగురువైప్పోలే"** అని తిరుక్కోళూర్పెణ్పిళ్ళై పల్కింది.

**69. కడలోశై ఎన్ఱేనో, పెరియనంబియైప్పోలే**

ఆళవందార్ శిష్యులలో మాఱనేర్నమ్బి ఒకరు. వారు పంచమకులానికి చెందినవారు. ఒకనాడు ఆళవందార్ తమ శిష్యులతో కలసి పరాంతకమనే



గ్రామం ద్వారా వెళ్ళేటపుడు మాఱనేర్ నంబి ఆకలిబాధను తీర్చుకోవడం కోసం సస్యక్షేత్రంలో ఉండే బురద, నీరు కలసిన మట్టిని చేతితో తీసికొని, భగవదర్పణం చేసి భుజించారు. దానిని చూచిన ఆళవందార్ ఆశ్చర్యపడి "సర్వేశ్వరుడు జీవుల ఆకలి బాధకు తగినట్లు అన్నపానాదులను సృష్టించగా, నీవు ఈ బురదను భుజిస్తున్నావే !'' అని అడిగారు. నమ్బి "స్వామీ ! మన్ను ఆస్వాదించడానికి మన్నునే కదా పెడుతున్నాను'' అని అన్నారు. దీనిని విన్న ఆళవందార్ "పుట్టినపుడే శఠవాయువుపై కోపించిన మాఱన్ అనే శఠకోపులా వీరు ?'' అని తలచి "వీరు ఈనాటినుండి మాఱనేర్నమ్బి అనే తిరునామంతో పిలువబడాలి'' అని అన్నారు. (మాఱనేర్నంబి అనే ఈపేరు వీరికి వీరు నివసించే గ్రామాన్ని బట్టి వచ్చిందని కూడా కొందఱు అంటారు).

ఆళవందార్, మాఱనేర్నమ్బిని తమతో పాటు రమ్మని పిలువగా, వారు తాము ఛండాలకులానికి చెందినవారు కనుక, "దాసునకు దేవరవారి వద్దకు వచ్చే అవకాశం లేదే!'' అని అన్నారు. ఆళవందార్ "బ్రహ్మజ్ఞానులకు వర్ణభేదం లేదు. ఏ అభ్యంతరం లేకుండా రావచ్చు.'' అని. అంటూ వారిని శ్రీరంగానికి పిలుచుకొనిపోయి ఉత్తరకావేరీ తీరంలో తూర్పుదిశగా నివసించేటట్లు చేశారు. వారిని తమ నిత్యకాలక్షేప గోష్ఠిలో అన్వయింపజేశారు.

ఒకనాడు ఆళవందార్ శ్రీరంగనాథుని దివ్యరూపాన్ని పాదాదికేశాంతంగా సేవించి నిలువగా, శ్రీరంగనాథుడు వారిని కటాక్షించి "మా పరమపదాన్ని మీకు అనుగ్రహించాము'' అని అర్చకముఖంగా పలికాడు. ఆమాట విని శ్రీయామునులు - "దేవా! దాసుడికి ఇంకా కొంచెం ప్రాకృతకర్మ అనుభవించ వలసి తీరవలసి ఉన్నది'' అని విన్నపించగా, "ఆ అనుభవాన్ని మీ శిష్యులలో ఎవరికైనా ఇవ్వండి'' అన్నాడు. ఆళవందార్ తమ మఠానికి తిరిగి వచ్చి, శిష్యులను చూచి "శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం మాకు మిగిలిన ఉన్న ప్రాకృతానుభవ శేషాన్ని మీలో ఎవరైనా గ్రహించడానికి సిద్ధంగా ఉన్నారా?'' అని అడిగారు. శిష్యులలో ఎవరూ ముందుకు రాలేదు. అపుడు ఆళవందార్ అభిమానాన్ని నోచుకొన్న మాఱనేర్ నమ్బి దూరంలో ఉండి దీనిని అంతా గమనించి, "స్వామీ!'' అని సాష్టాంగపడి నిలిచారు. శ్రీయామునులు వారి వద్దకు రాబోయారు.

"నేను దాసుడను ఛండాలకులానికి చెందినవాడను" అని దూరండగా తొలగిపోగా, "ఆ కులం మీకిపుడు వర్తించదు, దగ్గరకు రండి" అని పిలిచి, "మీకేమి కావాలి?" అని అడిగారు. మాఱనేర్ నమ్బి- "మీరిపుడు గోష్ఠిలోనియమించిన ప్రసాదాన్ని నాకు అనుగ్రహించండి" అని విన్నపించగా, "దానివల్ల కలిగే ఉపద్రవాన్ని మీరు సహించగలరా ?" అన్నారు. "అదే దాసునకు మహాప్రసాదం" అని నమ్బి పలుకగా, ఆళవందార్ వారికి శ్రీపాదతీర్థాన్ని అనుగ్రహించి, "ఓ ప్రాకృత కర్మమా! నిన్ను నేను అనునభవించవలసిన మిగిలిన కాలం నీవు మాఱనేర్ నంబిదగ్గరకు పో" అని నియమించి, శిష్యులను చూచి, "అంతిమకులంలో పుట్టిన మాఱనేర్ నమ్బికి కల్గిన నిష్ఠ మీకు లేకుండా పోయిందే" అని అన్నారు. తరువాత యామునులు కొద్దికాలానికే పరమపదాన్ని చేరారు.

తరువాత మాఱనే నంబి తాము పొందిన ఆచార్యానుగ్రహరూపమైన రాచపుండును మహాప్రసాదంగా భావించి అంగీకరించిన నాటినుండి ఆ బాధను సంతోషంగా అనుభవిస్తూ, దానినే ఆచార్యకైంకర్యమని తలుస్తూ ఉన్నారు. ఆ సమయంలో తమకోసం తళిహ (వంట)ను చేసికోలేక పోయినపుడు పెరియనంబి వారిని పంచమకులానికి చెందినవారని తక్కువగా భావించకుండా, వారికి తమ గృహంనుండి ప్రసాదాన్ని తీసికొని వచ్చి పెట్టేవారు.

ఒకనాడు మాఱనేర్నమ్బి, పెరియనంబిని చూచి, "ఈ నాటికి మూడవ నాడు దాసుడు ఆచార్య శ్రీచరణ సన్నిధికి చేరబోతాడు. అపుడు **"అచ్యుతా! గోవిందా!"** అని భగవన్నామాన్ని స్మరిస్తూ, ఆత్మ దేహాన్ని విడచిపోతే, ఆ దేహాన్ని సంస్కరించి, పుష్కరిణిలో స్నానంచేసి పోవాలి. భక్తినిష్ఠులైన ఆళ్వార్ల గుణానుభవ ప్రపత్తినిష్ఠను కల్గిన ఆత్మ వీడిపోతే అతని దేహాన్ని సంస్కరించి, కంఠస్నానాన్ని చేసి ఇంటికి పోవచ్చు. ఏవిధమైన అన్యధ్యానం లేకుండా, నా ఆచార్యులైన యామునుల శ్రీచరణాలనే ధ్యానించే నా ఆత్మవీడిపోతే, దాసుని దేహాన్ని శాస్త్రప్రకారం ప్రపన్నులకు చేయవలసిన క్రమాన్నిబట్టి చితిని పేర్చి, సంస్కరించి, పుష్కరిణిలో పాదాలను మాత్రం కడుగుకొంటే చాలు" అని అన్నారు.



ఆ విధంగానే ఆ నాటికి మూడవనాడు మాఱనేర్నంబి ఆచార్యసన్నిధిని చేరారు. పెరియనంబి వారి చరమదేహానికి చేయవలసిన సంస్కారాలను పదిదినాలు చేసి, తిరువధ్యయనోత్సవాన్ని కూడా నిర్వహించారు. దీనిని చూచిన శ్రీరంగాలయంలోని శ్రీవైష్ణవులు పంచమకులానికి చెందిన మాఱనేర్నంబికి పెరియనంబి చరమసంస్కారాలను చేశారు" అని వారిని జాతిబహిష్కరణ చేశారు.

ఒకనాడు శ్రీరామానుజులు ఏకాంతంలో పెరియనంబికి నమస్కరించి, "స్వామీ! మాఱనేర్నంబి విషయంలో దాసునివంటివారిని వినియోగించి కైంకర్యం నిర్వహించకుండా, దేవరవారే చేయడం లోకుల మనస్సును గాయపరుస్తున్నదే" అని విన్నపించారు. నమ్బి చిఱునవ్వు నవ్వి, "జీయర్ ! మాఱనేర్ నమ్బిని మీరు ఎందుకు స్మరించారు? ఒకవేళ నేను స్వయంగా చేయవలసిన సంధ్యావందనానికి వేఱొక వ్యక్తిని నియమించినా, ఈ కార్యానికి మాత్రం ఇంకొకరిని నియోగించను. నేను శ్రీరామునికంటే, ధర్మపుత్రుని కంటే గొప్పవాడనా? మాఱనేర్ నంబి జటాయువు కంటే, విదురాళ్వాన్ కంటే తక్కువవారా? ఇక్ష్వాకువంశస్థులైన శ్రీరాముడు, దశరథ చక్రవర్తి ప్రీతికోసంకదా పెరియవుడైయార్ (జటాయువు)కు పుత్రకృత్యాన్ని చేశాడు. విదురాళ్వాన్ శ్రీకృష్ణాభిమానాన్ని పొందినవాడైనందున కదా, ధర్మపుత్రుడు ఆయనకు పుత్రకృత్యాన్ని చేశాడు. నమ్మాళ్వార్ పల్కిన **"పయిలుమ్ శుడరొళి", "నెడుమాఱ్కడిమై"** మొదలైన దశకాలలోని అర్థాలు కేవలం సముద్రఘోష మాత్రమేనా ?" అని అన్నారు. శ్రీరామానుజులు వారి మాటకు సమ్మతించి పెరియనంబి మనస్సులోని గొప్పతనాన్ని ఈ విధంగా లోకానికి వ్యక్తం చేసి, నంబిపట్ల వ్యతిరేకభావాన్ని, సంశయాన్ని కలవారికి తగిన రీతిలో సమాధానాన్ని తెలిపారు.

పెరియనంబి వలె భగవద్భక్తుల పట్ల చూపవలసిన ప్రీతిని గూర్చి తెలిసికొని, దానిని అనుష్ఠానపర్యంతంగా కల్గి ఉండకపోతే, అది సముద్రఘోష వంటిదేకదా! అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"పెరియనమ్బియైప్పోలే కడలోశై యెన్ణేనో!"** అని పల్కింది. ఈ వృత్తాంతాన్ని ఆచార్యహృదయం 85వ సూత్రవ్యాఖ్యానంలో శ్రీవచనభూషణ వ్యాఖ్యలో గమనించవచ్చు.

## 70. శుగ్రీక్కిడన్దేనో, తిరుమాలైయాణ్డాన్‌పోలే

ఒకసారి, తిరుక్కోట్టియూర్‌నమ్బి శ్రీరంగానికి వేంచేసి, శ్రీరంగనాథుని సేవించి, తిరిగి వచ్చి, తిరుమాలైయాణ్డాన్‌ను వెంటబెట్టుకొని శ్రీరామానుజుల మఠాన్ని చేరారు. శ్రీరామానుజులను చూచి "శ్రీరామానుజా! మీరు తిరుమాలైయాణ్డాన్ వద్ద తిరువాయ్‌మొழி ప్రబంధానికి అర్థాన్ని వినండి'' అని పల్కి, తిరుమాలైయాణ్డాన్‌కు శ్రీరామానుజులను అప్పగించి, తిరుక్కోట్టియూర్‌కు వెళ్ళిపోయారు.

ఆవిధంగానే తిరుమాలైయాణ్డాన్ శ్రీరామానుజులకు తిరువాయ్‌మొழி ప్రబంధార్థాన్ని చెప్పడం ఆరంభించారు. తిరుమాలైయాణ్డాన్ తాము శ్రీయామునుల వద్ద ఆలకించిన అర్థాలను వివరించేవారు. కాని, శ్రీరామానుజులు ప్రతిపాశురానికి మఱికొన్ని విశేషార్థాలను తెలిపేవారు. వాటిని విని తిరుమాలై యాణ్డాన్ "శ్రీయామునులు ఈ అర్థాలను చెప్పగా ఏనాడు నేను వినలేదు'' అని పలికేవారు. **"అఱియాక్కాలత్తుళ్ళే"** అని ఆరంభమయే తిరువాయ్‌మొழி పాశురానికి అర్థాన్ని తిరుమాలై ఆణ్డాన్ వివరించేటపుడు, శ్రీరామానుజులు ఒక విశేషమైన అర్థాన్ని తెలుపగా, తిరుమాలైయాణ్డాన్ "ఇది విశ్వామిత్రసృష్టివలె ఉన్నదే! ఈవిధంగా యామునులు పలుకగా నాకు తెలియదు'' అని కోపంగా పలికారు. తరువాత కాలక్షేపాన్ని నిలిపివేశారు.

కొన్నాళ్ళకు ఈ సంగతి తిరుక్కోట్టియూర్‌నంబిని తెలిసింది. నంబి శ్రీరంగానికి వచ్చి, తిరుమాలైయాణ్డాన్‌ను చూచి, "తిరువాయ్‌మొழி కాలక్షేపం జరుగుతున్నదా ?'' అని అడిగాడు. ఆణ్డాన్ - "నేను ఆళవందార్ సన్నిధిలో తెలిసికొన్న అర్థాలను తెలుపుతూ ఉండగా, శ్రీరామానుజులు ఇంకొక రీతిలో కొన్ని అర్థాలను స్వకపోలకల్పితంగా పల్కుతున్నారు. అందువల్ల కాలక్షేపాన్ని నిలిపివేశాను'' అని అన్నారు. అపుడు తిరుక్కోట్టియూర్ నంబి శ్రీరామానుజులు పల్కిన అర్థాలను ఆణ్డాన్ ద్వారా తెలిసికొని, చాలా సంతోషించి, "ఈ అర్థాలను శ్రీయామునులు తెలుపగా గతంలో మేము విన్నామే !'' అని పల్కి, "రేపల్లెలో పెరిగిన శ్రీకృష్ణుడు సాందీపని వద్ద వేదాధ్యయనాన్ని చేసినట్లే, శ్రీరామానుజులు మీవద్ద తిరువాయ్‌మొழிకి అర్థాలను ఆలకిస్తున్నారని భావించండి.



శ్రీయామునుల మనస్సులో ఉండే అర్థాలే వీరి మనస్సులో స్ఫురిస్తాయి తప్ప, వేఱు అర్థాలు స్ఫురించవు అని భావించకండి'' అని కూడా పల్కి, ఆణ్డాన్‌ను, పెరియనంబిని పిలుచుకొని బయలుదేరి శ్రీరామానుజుల మఠానికి వచ్చారు. శ్రీరామానుజులు వారిని చాలా ప్రీతితో స్వాగతించి, సేవించి నిలిచారు. తిరుక్కోట్టియూర్‌నంబి, పెరియనంబి- ఇద్దఱు ఆణ్డాన్‌ను చూచి "ఇకపై తిరువాయ్‌మొழிలోని మిగిలిన భాగానికి అర్థాలను శ్రీరామానుజులకు తెలిపి, గ్రంథాన్ని పూర్తిచేయండి'' అని పల్కి శ్రీరామానుజులను కాలక్షేపాన్ని కొనసాగించమని వెళ్ళిపోయారు.

తరువాత ఆణ్డాన్ మళ్ళీ కాలక్షేపాన్ని ఆరంభించి, కొనసాగించారు. ఒకానొక సందర్భంలో ఆణ్డాన్ తెల్పిన అర్థాన్ని శ్రీరామానుజులు విని, "శ్రీఆళవందార్ ఈ విధంగా పల్కి ఉండరు'' అని విన్నపించారు. దానికి ఆణ్డాన్. "మీరు ఆళవందార్‌ను సాక్షాత్తుగా దర్శించలేదు. కాని, ఈవిధంగా వారి మనస్సులోని అర్థాలను ఏవిధంగా తెలియగల్గుతున్నారు?'' అని అడిగారు. శ్రీరామానుజులపుడు "ద్రోణాచార్యునకు ఏకలవ్యునివలె కదా, దాసుడు ఆళవందార్‌కు శిష్యుడు'' అని విన్నపించారు. అపుడు తిరుమాలైయాణ్డాన్‌కు తిరుక్కోట్టియూర్‌నంబి పూర్వం శ్రీరామానుజులను గూర్చి తమతో పల్కిన విషయం గుర్తుకు వచ్చి, "ఇది కూడా ఒక భగవదవతారం సుమా!'' అని శ్రీరామానుజులను గూర్చి మనస్సులో భావించారు. "శ్రీరామానుజా! మేము శ్రీయామునుల వద్ద ఆలకించని అర్థాలను అన్నిటిని మీవద్ద విన్నాము సుమా!'' అని పల్కి, లేచి వారికి నమస్కరించారు.

ఆ తరువాత, శ్రీరామానుజులు అపుడపుడు తిరువాయ్‌మొழிకి కొన్ని విశేషమైన అర్థాలను తెలిపేటపుడు ఆణ్డాన్ వారిని కౌగలించుకొని, చాలా సంతోషించడమే కాక, తమ కుమారుడైన సుందరత్తోళుడైయాన్‌ను శ్రీరామానుజులకు శిష్యులుగా చేశారు.

ఈరీతిలోనే నేను కూడా తిరుమాలైయాణ్డాన్‌వలె శ్రీరామానుజులను ఆనందంగా ఆలింగనం చేసికొన్నానా!- అని అంటూ తిరుక్కోళూర్‌పెణ్‌పిళ్ళై- **"తిరుమాలైయాణ్డాన్ పోలే శుగ్రీక్కిడన్దేనో !"** అని పల్కింది.

## 71. శూఴ్రవు కొణ్డేనో, తిరుక్కోట్టియూరార్‌పోలే

శ్రీరామానుజులు ఒకనాడు పెరియనంబి సన్నిధిలో దండం పెట్టి, "దాసుడు ఆళవందార్ సన్నిధిలో ఆశ్రయించని కొఱత తీరేటట్లు, దేవరవారిని ఆశ్రయించగలిగాను. ఇక, దేవరవారి మనస్సులో ఉండే విశేషార్థాలను తెలియజేయాలి'' అని అర్థించారు. "సరే! ఆ విధంగానే! రండి'' అని పల్కి, చాలా శ్లాఘ్యమైనది, సంసారసంబంధాన్ని తీర్చగల్గినది, వేదసారమైనది అయిన ద్వయమంత్రార్థాన్ని ఉపదేశించారు. "శ్రీయామునులు తమ అభిమానాంత ర్భూతులైన తిరుక్కోట్టియూర్‌నంబి వద్ద ఇంకా కొన్ని రహస్యార్థ విశేషాలను నిక్షిప్తం చేశారు. అందువల్ల మీరు వాటిని కూడా వారి శ్రీచరణ సన్నిధిలో ప్రార్థించి ఆలకించండి'' అని అన్నారు.

వెంటనే శ్రీరామానుజులు తిరుక్కోట్టియూర్‌కు చేరి, నంబి వేంచేసి ఉండే గృహానికి వెళ్ళారు. వారి ముందు సాష్టాంగప్రణామాన్ని చేసి, "దాసుని కటాక్షించి జ్ఞాతవ్యరహస్యార్థాలను ప్రసాదించండి'' అని ప్రార్థించారు. నంబికూడా శ్రీరామానుజుల నిశ్చయాన్ని తెలిసికోవడంకోసం ఏమీ బదులు పల్కకుండా ఉండిపోయారు. ఏమీ చేయలేని శ్రీరామానుజులు తిరిగి శ్రీరంగానికి వెళ్ళిపోయారు.

తరువాత, తిరుక్కోట్టియూర్‌నంబి అధ్యయనోత్సవాలను సేవించాలని శ్రీరంగడానికి వచ్చి, సేవించి తమ ఊరికి తిరిగి వెళ్ళేటపుడు, నంబెరుమాళ్ వారిని అర్చకముఖంగా ఆహ్వానించి పిలిచి, "మన శ్రీరామానుజులకు మీవద్ద ఉండే రహస్యార్థాలను ఉపదేశించండి'' అని నియమించాడు అపుడు "ఒక సంవత్సరకాలం కదలకుండా ఆచార్యసన్నిధిలో వాసం చేసిన శిష్యునకే ఉపదేశించాలని, అంతేకాక నీపట్ల భక్తి లేనివానికి, శుశ్రూష చేయనివానికి, నీ అవతారాలపట్ల అసూయపడేవానికి ఏనాడూ చెప్పకూడదని నీవే నియమించావు కదా! స్వామీ!'' అని నంబి అనగా, నమ్బెరుమాళ్ "శిష్యలక్షణ పూర్తి మన శ్రీరామానుజులలో పూర్తిగా ఉన్నది. మీరు వారికి ఉపదేశించడంలో అడ్డులేదు'' అని అన్నాడు. నంబి శ్రీరామానుజులను చూచి "మీరు మా ఊరికి రండి'' అని పల్కి వెళ్ళిపోయారు.



తరువాత, శ్రీరామానుజులు తిరుక్కోట్టియూర్‌కు వేంచేసినపుడు నంబి "ఈనాడు కాదు, రేపు రండి'' అని పద్దెనిమిది పర్యాయాలు వచ్చేటట్లు చేశారు. ఒక మాసం కాలం నిరాహారంగా ఉండే వ్రతాన్ని ఆచరింపజేసి, "నేను మీకు ఉపదేశించే రహస్యార్థాలను మీరెవ్వరికీ తెలుపకండి'' అని శ్రీరామానుజులతో పల్కి **"నలన్దరుమ్‌శొల్"** అని కీర్తింపబడే పెరియతిరుమంత్రం యొక్క అర్థాన్ని ప్రసాదించి, చరమశ్లోకార్థాలను తెలిపి, వానిని ఎవరికీ తెలుపవద్దని శ్రీరామానుజుల వద్ద మాట తీసికొన్నారు. ఈవృత్తాంతాన్ని గురుపరంపరా ప్రభావాది గ్రంథాలలో చూడవచ్చు.

ఈవిధంగా విశేషార్థాలను తెలిసి, వానిని వ్యక్తంచేయరాదని నేను తిరుక్కోట్టియూర్ నంబివలె ప్రమాణం చేయించుకొన్నానా?'' అనే భావంతో **"తిరుక్కోట్టియూరార్ పోలే శూఴ్రవుకొణ్డేనో"** అని తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై పల్కింది.

## 72. ఉయిరాయ పెఱ్ఱ్ఱనో ఊమైయైప్పోలే

ఒకనాడు శ్రీరామానుజులు ఒక మూగ వానిని కటాక్షించి, ఏకాంతంలోకి తీసికొనిపోయి, అతని శిరస్సుపై తమ శ్రీచరణాలను పెట్టి, అవే రక్షకమని సూచించారు. ఎవరికీ లభించని ఈ విశేష కటాక్షాన్ని కూరేశులు తలుపుల సందుద్వారా చూచి, తమకు అటువంటి అనుగ్రహం లభించలేదనే క్లేశంతో మూర్ఛిల్లి, కొంతసేపటికి తెలివిని పొంది, "అయ్యో! ఈమూగవలె ఏమీ తెలియని వాడనై పుట్టి ఉంటే ఈ భాగ్యానికి నోచుకొని ఉండేవాడను. నన్ను అపుడు శ్రీరామానుజులు, ఈమూగవానిని వలె, కటాక్షించి ఉండేవారు కదా! కూరేశులనై పుట్టి, శాస్త్రాలను అభ్యసించినందువల్లకదా, తమ దివ్యమంగళవిగ్రహాన్ని (శ్రీచరణాలను) నాకు ప్రసాదించకుండా, కేవలం ప్రపత్తిని మాత్రం నాకు శ్రీరామానుజులు ఉపదేశించారు'' శ్రీరామానుజుల దివ్యమంగళరూపం దాసునకు రక్షకం- అనే నిష్ఠకు నేను అధికారిని కాలేకపోయానే!'' అని తమను తామే గర్హించుకొన్నారు.

శ్రీరామానుజుల దివ్యమంగళరూపమే ఆత్మకు తగిన రక్షకం- అనే నిష్ఠకు మూగవాడు అధికారి అయ్యాడు. ఆవిధంగా నేను ఆచార్యుల నిర్హేతుక

కృపతో మూగవానివలె ఉజ్జీవించగలిగానా? అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై "ఉయిరాయప్పెఱ్ఱ్గ్రెనో, ఊమైయైప్పోలే" అని పల్కింది.

ఈవృత్తాంతం గురుపరంపరాప్రభావాది గ్రంథాలలో ప్రసిద్ధం. ప్రపన్నామృతంలోని 42వ అధ్యాయంలో **"తతః కదాచిత్ యోగీంద్రః కంచిన్మూకం ప్రగృహ్య చ, బద్ధ్వా కవాటం సుదృఢం గృహాంతే సంప్రవేశ్య తమ్, స్పృష్ట్వా స్వదేహం మూకాయ ప్రదర్శ్యోవాచ సంజ్ఞయా, ఇమ మేవ హి జానీహి శరణం గురువిగ్రహమ్, తమేవ రక్షకం ముఖ్యం మూక స్వమ్యగమన్యత, కవాటరంధ్రమార్గేణ కూరనాథో విలోక్య తత్... అహం స్యాం యది మూకోజ్ఞో మహ్యం దాస్యతి యోగిరాట్, ఇదం రహస్య మిత్యుక్త్వా మోహితోభూన్మహామతిః"** ఇత్యాదిగా ప్రస్తుతింపబడింది.

### 73. ఉడమ్బై వెఱుత్తేనో, తిరునఱైయూరారైప్పోలే

తిరునఱైయూర్ అరైయర్ అనే భక్తులు మేల్కోటెకు సేవించిరావడం అలవాటు. వారు ఒకపర్యాయం వేదనారాయణస్వామిని సేవించేటపుడు, పరమతానికి చెందినవారి అకృత్యంవల్ల అక్కడ కోవెలలో అగ్ని అంటుకొన్నది. అక్కడ ఉన్నవారు ఎంత ప్రయత్నించినా, అని నిప్పు ఆరలేదు. వెంటనే నాల్గు పక్కలనుండి అగ్ని చుట్టుకొని కోవెల అంతా మంటలు అంటుకొన్నాయి. ఎవరూ అక్కడలేకుండా అందఱు బయటకు వచ్చారు. అయితే, తిరునఱైయూర్ అరైయర్ మాత్రం స్వామి విడచిపెట్టి వెళ్ళలేక పోయారు. అర్చామూర్తినింకా అప్పటికి అగ్నిజ్వాలలు సోకనందున, ఆ మూర్తిని గట్టిగా కౌగలించుకొని ఉండిపోయారు. ఈ రీతిలో తమ ప్రాణాలను, శరీరాన్ని కూడా లెక్కించకుండా భగవానుని కాపాడడానికి ప్రయత్నించారు.

తిరునఱైయూర్ అరైయర్ వేదనారాయణస్వామిని ఈ విధంగా గట్టిగా పట్టుకొని ఉండగా, వారి భార్య పరుగెత్తుకొని వచ్చి, వారిని చుట్టుకొన్నది. ఆమెను చూచి వారిపిల్లలు వారిద్దఱిని కౌగలించుకొన్నారు. ఈవిధంగా అరైయర్ కుటుంబం అంతా భగవద్రక్షణ రూపకైంకర్యంలో మరణించారు. శరీరాన్ని ఏమాత్రం లెక్కచేయలేదు.



ఈరీతిలో నేను చేశానా? అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై- **"తిరునఱైయూరార్ పోలే ఉడమ్బై వెఱుత్తేనో"** అని అన్నారు. ఈవృత్తాంతం శ్రీవచనభూషణంలో 84వ సూత్రంలో ప్రస్తావింపబడగా, దానిని శ్రీవరవర మునులు తమ వ్యాఖ్యలో వివరించారు.

### 74. ఎన్నైప్పోలే -ఎన్ఱేనో, ఉపరిచరనైప్పోలే

పూర్వం ఒకానొక సమయంలో ఇంద్రుడు చేసిన యాగంలో, ఉపయోగించవలసినది పిష్టపశువా? (పిండితో చేసిన పశువా?) లేక, ప్రాణంతో కూడిన పశువా? అనే సందేహం కల్గింది. ఋషులు పిష్టపశువునే హోమం చేస్తే చాలు - అని అన్నారు. దేవతలు ప్రాణంతో ఉండే పశువును హోమం చేయాలన్నారు. ఈ సందేహాన్ని గూర్చి వారంతా కలసి ఉపరిచరవసువు వద్దకు వెళ్ళి అడిగారు. అతడు దేవతల పక్షానికి అనుగుణంగా పక్షపాతంతో తీర్పు చెప్పాడు. అందువల్ల ఋషుల శాపానికి గురియై పాతాళంలోకి పడిపోయాడు. అక్కడ అసురులు అతనిని పలు రీతులలో బాధించి, నాస్తికునిగా చేయాలని ప్రయత్నించారు. కాని, అతడు సర్వేశ్వరునే ధ్యానిస్తూ స్థిరంగా నిలచిపోయారు. అసురుల ప్రయత్నం ఫలించలేదు. వారు బ్రాహ్మణవేషాన్ని ధరించి, అతని వద్దకు వచ్చి, భగవంతుని పలు విధాలుగా దూషించి, ఉపరిచర వసువు మనస్సును కలత పొందించాలని చూచారు. కాని, అతడు వారి దుర్గతిని తలచి, వారి దోషాన్ని సహించమని, వారికి మంచి జ్ఞానాన్ని కల్గించమని భగవంతుని ప్రార్థించాడు. తత్ఫలంగా వారికి యథార్థజ్ఞానం కల్గింది.

ఉపరిచరవసువు తన వద్దకు వచ్చిన, మాఱు వేషంలోని అసురులను తనవలె భావించి, వారి మనస్సును మార్చాడు. "వీరిని నావలె యథార్థజ్ఞానాన్ని కలవారివిగా చేస్తాను'' అని వారిని విష్ణుభక్తులయేటట్లు చేశాడు.

నాస్తికవాదాన్ని చేసేవారినికూడా మంచి మనస్సుతో సంస్కరించి, వారిని ఉజ్జీవింపజేసిన గొప్పతనం కలవాడు, ఉపరిచరవసువు. ఈవిధంగా ఉపచరవసువువలె ఇతరుల మంచిని ఆశించి యత్నించానా? అనే భావంతో తిరుక్కోళూర్పెణ్పిళ్ళై **"ఉపరిచరనైప్పోలే ఎన్నైప్పోలే ఎన్ఱేనో"** అని పల్కింది.

## 75. యాన్ శిఱియన్ ఎన్టేనో, తిరుమలైనమ్బియైప్పోలే

శ్రీరామానుజులు వేంకటేశ్వరుని సేవించడం కోసం తిరుమలకు వేంచేశారు. అపుడు పెరియతిరుమలైనంబి శ్రీవేంకటేశ్వరుని తీర్థ ప్రసాదాలను తీసికొని, ఎదురేగి శ్రీరామానుజులకు స్వాగతాన్ని పలికారు. శ్రీరామానుజులు నంబి శ్రీచరణాలకు నమస్కరించి, "స్వామీ! ఈ దాసుని కోసం దేవరవారు ఇంతదూరం రావాలా? ఎవరిని అయినా చిన్నవారిని పంపించి ఉండవచ్చుకదా!" అని విన్నపించారు. నంబి అపుడు చిఱునవ్వుతో "శ్రీరామానుజా! ఈ తిరుమలలో నాల్గు వీధులలో ఎంతగా వెదికి చూచినా నాకంటే చిన్నవారెవరూ నాకు కన్పించలేదు. అందువల్ల నేనే వచ్చాను'' అని అన్నారు.

ఈ వృత్తాంతం ప్రపన్నామృతంతో **"శ్రీశైలపూర్ణః కృపయా తత్ప్రసాదం సుపావనమ్, ఆదాయాభిముఖం ప్రాప్య తన్మధ్యే యతిపుంగవమ్, యతీంద్రాయాదిశత్ తస్మై.. ప్రసాదం ప్రతిగృహ్యైశు యతీంద్రః పూర్ణమ బ్రవీత్, మహ్యం ప్రసాదమానేతుం కిం యుక్తం భవతో గురో, కేనచిత్ బాలకేనేదం ప్రేషితుం న హి శక్యతే, స పూర్ణః తద్వచః శ్రుత్వా యతిరాజమ భాషత, వేంకటాద్రౌ చతస్రుషు వీథీష్వాలోకితో మయా, మాం వినా బాలకో నాస్తి కుత్రాపి యతిపుంగవ!"** ఇత్యాదిగా 28వ అధ్యాయంలో తెలుపబడింది.

"భగవంతుని దాసులలో నేను చాలా చిన్నవాడను'' అని భావించడం శ్రీవైష్ణవుని స్వరూపం. దీనిని నేను గ్రహించి ఆచరించాను'' అని అన్నారు నమ్బి. ఈవిధంగా తిరుమలనంబి వలె నేను కూడా చరమావధిదాసత్వాన్ని భావించానా? అనే అభిప్రాయంతో తిరుక్కోళూర్ ప్పెణ్పిళ్ళై **"తిరుమలైనమ్బియైప్పోలే నాన్ శిఱియన్ - ఎన్టేనో"** అని పల్కింది.

## 76. నీరిల్ కుదిత్తేనో, కణపురత్తమ్మాళైప్పోలే

పూర్వాచార్యపరంపరలో ఒకరైన నమ్బిళ్ళై, వారి శిష్యులు కలసి తిరువెళ్ళఱై దివ్యదేశంలోని తాయార్‌ను సేవించి, తిరిగి శ్రీరంగానికి వచ్చేటపుడు, తటాలున కావేరీనదిలోని ప్రవాహం పెరిగి, ఆ నది ఉద్ధృతంగా ప్రవహించడం ఆరంభించింది. అపుడు అక్కడ పెద్దనావ లేనందున, వారు



చిన్న పుటిక (బుట్టవంటి, నదిని దాటే సాధనం) లోకి ఎక్కి నదిని దాటడానికి యత్నించారు. నది మధ్యలో పుటిక ఉండగా, బాగా సాయంకాలమై, అంతటా చీకటి అలముకొన్నది. వర్షం అధికమైనది. దారి తెన్నులు తెలియని స్థితి ఏర్పడింది. ఎక్కువ బరువువల్ల పుట్టి క్రమంగా నీటిలోకి మునిగిపోవడం ఆరంభించింది. "పుట్టినుండి ఒకరిద్దరు దిగితే తప్ప అది తీరాన్ని చేరలేని స్థితి ఏర్పడింది''-అని దానిని నడిపేవాడు అన్నాడు. అపుడు అది నది మధ్యలో ఉన్నందున, మిక్కిలి భయంవల్ల ఎవరూ నదిలో దూకడానికి సిద్ధపడలేదు. ("కణపురత్తాళ్'' అనే పేరుగల) అపుడొక సాత్త్వికురాలైన స్త్రీ తెప్ప నడిపేవానిని చూచి, "నీవు నూఱేండ్లు బతకాలి. లోకాలకు అన్నిటికి అద్వితీయ ప్రాణరూపులైన ఈ నమ్బిళ్ళైను జాగ్రత్తగా తీరానికి చేర్చు'' అని పల్కి, అతనిని ఆశీర్వదించి, చీకటిని లెక్కించకుండా నదిలో దూకింది. తరువాత పుట్టి సురక్షితంగా తీరాన్ని చేరింది. నమ్బిళ్ళై తీరాన్ని చేరి "ఒక మహాభక్తురాలను కోల్పోయామే'' అని గట్టిగా పలుమార్లు బాధతో అంటూ, నాలుగైదు అడుగులు వేశారు. చీకటివేళ అయినందున- కాలికి దారిలో ఎత్తైన చోటు కాలికి అడ్డు తగిలినందున తడబడ్డారు. రాత్రిసమయంలో అయినందున, తీరం ఎక్కడ ఉన్నదో తెలియనందున, అంతలో తమాయించుకొని నడిచారు. అపుడు తమ ఒక స్త్రీ పల్కిన "స్వామీ! దేవరవారు వ్యాకులపడవద్దు. నేనిక్కడే ఉన్నాను'' అనే మాట కన్పించింది. నమ్బిళ్ళై పుటికను నడిపేవానిని పిలచి ఆమెను తీరానికి చేరేటట్లు చేశారు. ఆమె నమ్బిళ్ళై వద్దకు వచ్చి నమస్కరించి, ఆచార్యులు తప్ప వేఱొక దైవం తెలియనిది అయినందున, "నేను నదిలో కొట్టుకొని పోయేటపుడు మీరేకదా ! రక్షించారు'' అని అన్నది. ఆమె ఆచార్యనిష్ఠకు విస్మయాన్ని పొందిన నమ్బిళ్ళై "నీ ఆచార్య విశ్వాసం ఇంతగొప్పది అయినపుడు, నీవు ఈ విధంగా అనడం తగినదే కదా!'' అని అన్నారు.

సర్వవిధబంధువైన ఆచార్యుని రక్షించడంకోసం తన ప్రాణాన్ని లెక్కించకుండా నదీప్రవాహంలో దూకిన కణపురత్తాళ్‌కు వలె నాకు ఆచార్యభక్తి ఉన్నదా? అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"కణపురత్తాళై ప్పోలే నీరిల్ కుదిత్తేనో"** అని పల్కింది.

## 77. నీరూకమ్ కొణ్డేనో కాశి శిఙ్గనైప్పోలే

కాశీమహానగరంలో "శిఙ్గన్" అనే ప్రభువు ఉండేవాడు. అతడు మనస్సులో "నేను"- అనే అహంకారాన్ని, "నాది" అనే మమకారాన్ని అధికంగా కల్గి ఉండేవాడు.

ఒకసారి అతడు గంగాస్నానానికి వెళ్ళి, అక్కడ తీరంలో ఉండేవారిని చూచి "నాకు ఈగంగ ఒక విషయమే కాదు. నేను ఈ గంగను పదిసార్లు చుట్టి రాగలను. ఈదడంలో నేను చాలా సమర్థుడను. నేను సముద్రాన్ని కూడా కలతను పొందించగలను. నావలె ఈదగల్గిన వాడెవడూ లోకంలో లేదు.'' అని గొప్పలు చెప్పుకొంటూ గంగానదిలోకి దిగాడు. నాల్గు సార్లు గంగను చుట్టాడు. అపుడు గంగలోని నీటి ప్రవాహం అధికమైనది. ఒక సుడి శిఙ్గన్‌ను లోపలకు లాగి ముంచివేసింది. అతడు తనకు వీలయినంతవరకు బయటకు రావడానికి ప్రయత్నం చేశాడు కాని సాధ్యపడలేదు. "అహంకరించి అనర్థాన్ని కొని తెచ్చుకొన్నానే ! ఇక నన్ను సర్వరక్షకుడైన భగవంతుడొక్కడే కాపాడగలడు. అతనినే అర్థించాలి. లేకపోతే నాగతి అధోగతియే''. అని తలచి, అతడు "ఓ పరమాత్మా! అనాథరక్షకా! ఆపద్బంధూ! నీవు నన్ను తీరానికి చేరిస్తేనే నాకు బ్రతుకు. లేకపోతే నాకు గతి లేదు. ఈ ఆపదనుండి నన్ను కాపాడవా! నన్ను రక్షించగలిగేవారు నీవు తప్ప ఇంకొకరు లేరు. నిన్ను నమ్మి శరణాగతి చేసిన ద్రౌపదిని రక్షించావు కదా! గజేంద్రుడు "ఆదిమూలమా!" అని ఆక్రందిస్తే అతనిని గొప్ప ఆపదనుండి రక్షించావుకదా! నిన్ను నమ్మిన సీతాదేవిని రావణుని బారినుండి రక్షించావుకదా! ఆవిధంగానే నన్ను కాపాడు. లేకపోతే నా మరణం తథ్యం'' అని ప్రార్థన చేశాడు.

అతని హార్దమైన ప్రార్థనను మన్నించిన భగవంతుడు ఒక పెద్దగాలి వీచేటట్లు చేశాడు. అపుడు గాలివేగం వల్ల నదిలో కెరటం తరువాత ఇంకొక కెరటం వరుసగా లేచాయి. ఆ కెరటాలు శిఙ్గన్‌ను తీరానికి చేర్చాయి. శిఙ్గన్ భగవంతుని కరుణాస్వభావాన్ని తలచి, ఆనందసముద్రంలో మునిగిపోయాడు. ఇంటికి చేరి, తిరుమణ్‌కాప్పును ధరించి, శ్రీమన్నారాయణునకు నమస్కరించి, "భగవత్కృపకు లక్ష్యమయ్యానుకదా!'' అని ఆస్వామిని స్తుతించాడు.



శిఙ్గన్ మొదట గంగానదిలో అహంకారంతో గర్వంతో దూకాడు. తరువాత, తనకు కల్గిన ఆపదను గ్రహించి, భగవంతుని కృపను తలచి శరణాగతి చేశాడు. ఆవిధంగా నేను పశ్చాత్తాపంతో భగవంతుని శరణాగతిని చేశానా? - అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై **"కాశిశిఙ్గనైప్పోలే నీరూకమ్ కొణ్డేనో"** అని అన్నది (**"ఊకమ్"** - అంటే- ఊహ - ఆలోచన- యుక్తి-అని భావం.)

## 78. వాక్కినాల్ వెన్ఱేనో, భట్టరైప్పోలే

పరాశరభట్టర్ అయిదు సంవత్సరాల వయస్సులో ఉన్నపుడు, ఒకనాడు వీథిలో ఆడుకొంటున్నారు. అపుడు సర్వజ్ఞభట్టర్ అనే పేరు గల మాయావాది గొప్ప సంరంభంతో కాహళం (బాకా) ఊదించి, శబ్దం చేస్తూ, తన బిరుదులను ఘోషింపజేసికొంటూ, పల్లకిపై ఎక్కి పరాశరభట్టర్ ఆడుకొనే వీథిలోకి వచ్చాడు. భట్టర్ అతనిని చూచి, "ఈయన ఎవరు ? భగవద్రామానుజులు, కూరేశులు, ఆణ్డాన్, ఎమ్బార్, అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్, మొదలైన మహనీయులుండే ఈ చోట తన బిరుదులను గర్వంతో తాను సర్వజ్ఞుడనని చాటింపు వేయించుకొంటూ వస్తున్నాడే! ఈయన సర్వజ్ఞత్వాన్ని నేనే ముందుగా పరీక్షించి చూస్తాను'' అని తలచారు. తమ చేతిలో పిడికెడు బూడిదను తీసికొని, అతనికి ఎదురుగా వెళ్ళి, "ఓ పండితుడా! నీవు సర్వజ్ఞుడవే అయితే, ఇది ఎంత చెప్పు'' అపుడే నీ సర్వజ్ఞత్వాన్ని నేను ఒప్పుకొంటాను'' అని అన్నారు. అతడు భట్టర్ మాటను విని భ్రమపడి, భట్టర్‌చేతిలోని బూడిదలో ఎన్ని రేణువులున్నాయో లెక్కించడం సాధ్యం కాదని తలచిన, ఏమీ బదులివ్వకుండా మౌనంగా ఉండిపోయాడు. అపుడు భట్టర్ నవ్వి "ఇది ఒక పిడికెడు బూడిద'' అని చెప్పలేనివాడవు నీకా ఈ సర్వజ్ఞత్వబిరుదం! చాలా బాగుంది. ఇక, బిరుదును చాటింపు వేయడం చాలు నిలుపు'' అని అన్నారు. భట్టర్ పలికే ముద్దు మాటలను విని సర్వజ్ఞభట్టు ఆశ్చర్యానందాలతో "ఇతడెవరి కుమారుడు?'' అని అక్కడ ఉండేవారిని ప్రశ్నించగా, వారు "కూరేశుల పుత్రుడితడు'' అని బదులిచ్చారు. "ఆహా! అని ఆశ్చర్యపడి, భట్టర్‌ను తన పల్లకిపై కూర్చొండబెట్టుకొని, కూరేశుల గృహానికి తీసికొని

వెళ్ళి సర్వజ్ఞభట్టు విడిచాడు. పొన్నాచ్చియార్ (హేమాంబిక) వీరు చేసిన ఈ కృత్యాన్ని విని, పరుగెత్తి వచ్చి, భట్టర్‌ను ఎత్తుకొని, ద్వయానుసంధానంతో రక్షను పెట్టి, తమ ముందు కొంగుతో భట్టర్‌ను కప్పి లోపలకు తీసికొని పోయింది. "ఈ విధంగా వీరిని అందటి దృష్టి తగిలేటట్లు విడిచారే!'' అని పల్కి, కూరేశుల పత్ని ఆణ్డాళ్‌కు అప్పగించింది. అపుడు ఆణ్డాళ్ భట్టర్‌పై శ్రీపాదతీర్థాన్ని ప్రోక్షించి, "వీరు ఎవరిదృష్టి దోషం పడకుండా లోకంలో వీరు చిరకాలం ఉండాలి'' అని మనస్సులో మంగళాశాసనాన్ని చేశారు.

తరువాత, శ్రీరామానుజుల ఆదేశానుసారం భట్టర్ మేల్‌నాడు ప్రాంతాన్ని చేరి, వేదాంతిని వాదంలో జయించి, వారిని శిష్యునిగా చేసికొన్నారు. దీనివల్ల శ్రీవైష్ణవసిద్ధాంతం మూడు పువ్వులు ఆఱు కాయలుగా వృద్ధి చెందింది. ఈ రీతిలో శ్రీవైష్ణవదర్శనం వృద్ధి చెందేటట్లు నేను ఏమయినా చేశానా? అనే భావంతో తిరుక్కోళూర్‌పెణ్‌పిళ్ళై- **"భట్టరైప్పోలే వాక్కినాల్ వెన్ఱేనో?"** అని పల్కింది.

### 79. వాయిల్ కైయిట్టేనో, ఎమ్బారైప్పోలే

భగవద్రామానుజులు పెరియ తిరుమలై నంబి సన్నిధిలో ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణంలోని అర్థాలను ఆలకిస్తూ, ఒక సంవత్సరకాలం తిరుపతిలో వేంచేసి ఉన్నారు. అపుడు శ్రీగోవిందప్పెరుమాళ్ (ఎమ్బార్) పెరియతిరుమలైనంబి ఇంటిలో అన్ని కైంకర్యాలను చేసే రీతిని శ్రీరామానుజులు చూచి, వారి పట్ల చాలా ప్రీతిని కల్గి ఉండేవారు.

ఒకనాడు శ్రీరామానుజులు తిరుమలనంబి పెంచే నందనవనం వైపు వెళ్ళేటపుడు, దారిలో ఎమ్బార్, తాము చేసే కైంకర్యాన్ని విడచిపెట్టి, ఒక చోట ఒక పాము నోటిలో చేతిని పెట్టి, తరువాత స్నానం చేసిరావడం గమనించారు. తిరిగివచ్చిన ఎమ్బార్‌ను చూచి "మీరు దారిలో ఏం చేశారు?'' అని వారిని రామానుజులు ప్రశ్నించారు. "స్వామీ! నేను పాము తను నాలికను చాచి నోరు తెరవలేని రీతిలో బాధపడుతూ ఉండడం చూచి, దాని నాలుకను పరిశీలించి చూచాను. అందులో దిగిన ముల్లును తీసివేశాను.'' అన్నారు.



శ్రీరామానుజులు గోవిందభట్టర్‌కు ఉండే భూతదయను చూచి ఆశ్చర్యపడి ఆనందించారు.

ఈవృత్తాంతం **"కదాచిలక్ష్మణాచార్యే పూర్ణాచార్యవనం ప్రతి, గతే తత్రాస గోవిందో ద్విజిహ్వాస్యాసనే కరమ్, నిక్షిప్యాథ కృత స్నానః కైంకర్యార్థం తతోద్యతః , దృష్ట్వైతత్ లక్ష్మణాచార్యః తం గోవింద మథాబ్రవీత్, భో గోవిందాధునా కార్యం కృతవానపి కిం వద, ఇత్యుక్తో యతిరాజేన గోవిందః ప్రాహ తం తదా, జిహ్వాయాం కంటకం స్యూతం ద్విజిహ్వాం పరమాపదమ్, ప్రాప్తం దృష్ట్వాథ తద్వక్త్రే హస్తం నిక్షిప్య కంటకమ్, ఆకృష్య సరసి స్నాత్వా సమాయాతో యతీశ్వర!"** అని ప్రపన్నామృతంతో 29వ అధ్యాయంలో ప్రస్తుతింపబడింది.

ఇటువంటి భూత దయ నాకున్నదా?- అనే భావంతో తిరుక్కోళూర్ పెణ్పిళ్ళై - **"వాయిల్ కైయిట్టేనో, ఎమ్బారైప్పోలే"** అని పల్కింది.

### 80. తోళ్‌కాట్టి వన్దేనో, భట్టరైప్పోలే

పరాశరభట్టర్ వేంచేసే పల్లకిని మోసేవారిలో ఒకరికి అంతిమదశ ప్రాప్తించింది. వారు మరణదశలో ఉండగా, వారి ఆత్మను తీసికొనిపోవడం కోసం యమభటులు వచ్చారు. అదే సమయంలో, వారు, భట్టర్‌కు కైంకర్యం చేసేవారైనందున, విష్ణుదూతలు కూడా వారి ఆత్మను తీసికొని పోవడం కోసం వచ్చారు. వారిని చూచిన యమభటులు "మీరెందుకు వచ్చారు! ఈ ఆత్మను మేము కదా! తీసికొని పోవాలి'' అని అన్నారు. అపుడు విష్ణుదూతలు కూడా "ఆ విధంగా కాదు, వీరు భట్టర్‌కు దాసులు కనుక వారిని తీసికొని రమ్మని శ్రీమన్నారాయణుని ఆజ్ఞ'' అని అన్నారు. యమభటులపుడు "అయితే, వీరికి ఎక్కడా చక్రాంకన చిహ్నం లేదే!'' అని ప్రశ్నించారు. ఈవిధంగా వారు పరస్పరం సంభాషించే సంభాషణ అంతిమదశలో ఉండే భట్టర్ సేవకుల చెవిలో పడింది. వెంటనే వారికి తెలివి వచ్చింది. "అయ్యో! నేను ఇంత కాలంగా భట్టర్‌కు కైంకర్యం చేసినా, వారివద్ద పంచసంస్కారాలను పొందలేదే!'' అని వగచారు. వెంటనే, దగ్గర ఉండే వారిని పిలచి, "మీరు వెంటనే భట్టర్ దగ్గరకు పోయి, మీ దాసుడు మిమ్ములను దర్శించగోరు తున్నాడు. అతడు అంతిమదశలో

ఉన్నాడు. మీరతని వద్దకు వచ్చి కాపాడాలి'' అని చెప్పమని పంపించారు. వారు కూడా వేగంగా పోయి, భట్టర్‌కు విన్నపించి, వారిని తీసికొని వచ్చారు.

భట్టర్‌ను చూడగానే, వారి దాసుడు "స్వామీ! దేవరవారివద్ద ఇంతకాలం కైంకర్యం చేసినా, పంచసంస్కారాలను పొందలేకపోయానే! నన్ను యమభటులు నరకానికి తీసికొనిపోతున్నారే !'' అని విలపించాడు. భట్టర్, వారిని కటాక్షించి, "మీరు చింతపడకండి. మీకు పంచసంస్కారాలను చేయడానికి ఇపుడు అవకాశం లేదు. అయితే, మీరు, మాపల్లకిని మోసేవారు కనుక, మీ భుజాలలో అందువల్ల ఏర్పడిన కిణాలు (కాయలు) ఉన్నాయి. కనుక మీరు మాకు దాసులు - అనే విషయంలో సందేహం లేదు. మీరు నరకానికి వెళ్ళరు. పరమపదప్రాప్తి తథ్యం'' అని వారి భుజాలలోని కాయలను చూపి, అనునయించారు.

ఒక ఆత్మ మిక్కిలి క్లేశపడే సమయంలో భట్టర్‌వలె ఆశ్వాసవాక్యాలను పలికానా?- అనే భావంతో తిరుక్కోళూర్‌పెణ్పిళ్ళై **"భట్టరైప్పోలే తోళ్‌కాట్టి వన్దేనో"** అని పల్కింది.

## 81. తుఱై వేఱు శెయ్‌దేనో, భగవరైప్పోలే

విల్లిపుత్తూర్ భగవర్ అనేవారు, తిరువహీంద్రపురంలో మిగిలిన శ్రీవైష్ణవస్వాములు స్నానం, అనుష్ఠానం చేసే రేవులో దిగకుండా, ప్రత్యేకంగా ఇంకొక రేవులో ప్రవేశించి స్నానం చేసేవారు. తమ అనుష్ఠానాలను పూర్తి చేసికొని తిరిగి వచ్చేటపుడు, వారిని అక్కడ ఉండే బ్రాహ్మణోత్తములు చూచారు. "స్వామీ! మేమంతా స్నానమాడే రేవులో ప్రవేశించకుండా, మీరు ఇంకొక రేవులో దిగి స్నానం చేశారెందుకు ?'' అని అడిగారు. అపుడు విల్లిపుత్తూర్ భగవర్ "మీరంతా వర్ణాశ్రమాలనే అనుసరిస్తూ వర్తిస్తున్నారు. నేనయితే, పూర్వాచార్యుల జ్ఞానానుష్ఠానాలను అనుసరించి వర్తించే శ్రీవైష్ణవులకు దాసుడను. బ్రాహ్మణోత్తములు అనుష్ఠానం చేసికొనే రేవు మాత్రమే నాకు కావాలి- అనే నిర్బంధం లేదు. భగవంతుని దాసులకే కైంకర్యం చేసే దాసుడను నేను. అందువల్ల మీరు స్నానమాడే రేవుకు నేను రాలేదు. నేను ప్రవేశించే రేవు వేఱుగానే ఉండనివ్వండి'' అని పల్కి వెళ్ళిపోయారు.



దీనిని ప్రమాణం **"పణ్డే యుయిరమనైత్తుమ్ పజ్గయత్తాళ్ నాయకన్కే తొణ్డా మెన త్తెళిన్ద తూయ మనత్తార్‌క్కుఙ్గో, పల కూఱ్ఱమ్ తమ్ముడమ్బై ప్పార్‌త్తబిమానిక్కుమ్ ఉలకత్తవరోడుఱవు"** అనే జ్ఞానసార (12) పాశురం.

ఈ రీతిలోనే నేను భగవర్‌వలె వేఱు రేవులో స్నానమాడానా? - అనే భావంతో తిరుక్కోళూర్‌ప్పెణ్పిళ్ళై **"బకవరైప్పోలే తుఱై వేఱు శెయ్‌దేనో!"** అని పల్కింది.

ఈవిధంగా తిరుక్కోళూర్‌ప్పెణ్‌పిళ్ళై పలు వార్తలను విన్నపించింది. "ఇటువంటి జ్ఞానాధిక్యాన్ని కలవారి జ్ఞానంలోని అంశమైనా నావద్ద ఉంటే, నేను తిరుక్కోళూర్‌లో నివసించవచ్చు. జ్ఞానంలేని అల్పురాలనైన నేను ఎక్కడ ఉంటే ఏమి ? దేవరవారు వేంచేసి, ఇక్కడి స్వామికి మంగళాశాసనం చేస్తే, వైత్తమానిదిస్వామికి, మధురకవులకు నిత్యోత్సవ, సంవత్సరోత్సవాలు ఏలోటూ లేకుండా జరుగుతాయి'' అని భక్తితో, ఆర్తితో పెణ్‌పిళ్ళై పల్కింది. శ్రీరామానుజులు చాలా సంతోషించి, ఆమె ఇంటిలో ప్రసాద స్వీకారాన్ని చేసి శ్రీపాదతీర్థాన్ని భుక్తశేషాన్ని ఆమెకు ప్రసాదించారు.

ఈవిధంగా తిరువాయ్‌మొழிప్పిళ్ళై అనుగ్రహించినట్లుగా పెరియవాన మామలై జీయర్ తెలియజేశారు.